# నామ సుధానిధి

## సుందరకాండ సహితము





రచన

శ్రీమతి కె. కె. ప్రసూన

శ్రీ రా మ నా మ సు ధా ని ధి
సుందరకాండ  సహితము

ప్రథమ ముద్రణ :
1000 ప్రతులు - ఆగస్టు 77

ప్రతులకు :
శ్రీమతి S. S. ప్రసూన
W/o శ్రీ S. వీరభద్రరావు
B 18 వేంకట్రాయపురం
తణుకు - 534211

ముఖచిత్రం :
చి॥ S. విమల

హక్కులు :
రచయిత్రివి

ప్రతులు దొరుకుచోటు :
ర చ యి త్రి
C/o 3-5-1091/10,
నీలాద్రి వేంకటేశ్వర కాలనీ
నారాయణగుడ - హైదరాబాద్ -

ముద్రణ :
శ్రీ దుర్గా ప్రింటింగ్ వర్క్సు
రాజమండ్రి

# కృతిభర్త




మహామండలేశ్వర్, భాగవతచరితవ్యాస్

శ్రీ శ్రీ శ్రీ రామశరణ్

శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు

వారి సతీమణి

శ్రీమతి శేషమాంబగారు

# అంకితము

శ్రీ సద్గురుభ్యోనమః

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురువేనమః.

[ శ్రీ గురువుగారినే సాక్షాత్తు శ్రీరామచంద్రమూర్తిగా భావించి యీ చిన్నారి కావ్యకన్యను జనకకన్యగా సద్గురువర్యులకు భక్తితో సమర్పించుకుంటున్నాను ]

చిన్నారి పొన్నారి చిలిపి ముద్దులతల్లి
సీతమ్మ చూపట్టి నందుకొనవయ్య
మాయమ్మ మమువీడి క్షణమైన నిలువదు
నీచేయి పట్టింది నిను కోరివచ్చి
నీ గుండెలో గుండె, నీ మనసులో మనసు
ప్రేమమీరగ నిచ్చి సాదుకొనుమయ్య
శ్రీరాముడవు నీవు చేరిరక్షింపగా
మా వీటికొచ్చావు మముగన్నతండ్రి
భక్తిమీరగ నీదు పాదాలు కొలువంగ
ఫలపుష్పతోయములు మా వీటలేవు

మమకారముప్పొంగ మనసులో మాటలే
ఈ పొత్తముగ కూర్చి నీకిస్తినయ్య
మా తప్పులనుగాచి మమ్మేలుకొనుము
జయము జయము నీకు జానకీరామ
శ్రీరామ శ్రీరామ శ్రీరామ శరణు.

రచయిత్రి



# ముందుమాట

"శ్రీరామ రామ రామేతి రమేరామ మనోరమే
సహస్రనామతత్తుల్యం రామనామం వరాననే" అని

పరమశివుడే రామతత్త్వాన్ని కొనియాడినట్లు విష్ణు సహస్ర నామ ఉత్తరపీఠికలో నున్నది.

శ్రీరామ నామస్మరణము మూడు పద్ధతులు. అవి భక్తి జ్ఞాన వైరాగ్యములు. అందు భక్తి మార్గము భగవంతుని తెలుసుకునేందుకు అత్యంత సులభమార్గము. భక్తి సులభముగా నలవడి మనస్సునకు హత్తుకొనవలెనన్న అందుకు చిన్నచిన్న కథలతో గూడిన కావ్యములు ఎంతేని వుపయోగముగా నుండును.

శ్రీమతి S. S. ప్రసూనగారు ఆంధ్ర పాఠకలోకానికి పరిచితులే. వీరి కథలు, వ్యాసాలు అనేకం వార, దిన పత్రికలలో ప్రచురింపబడెను. వీరు ఇటీవల భక్తియుతమైన రచనలందుగూడ నాసక్తి చూపుచున్నారు. వారి ఇష్టదేవము శ్రీ వేంకటేశ్వర స్వామివారిమీద కొన్ని కీర్తనలు వ్రాసి "పూజా ప్రసూనము" అన్న పేరుతో చిన్న పొత్తమును ప్రచురించినారు.

ఇంతలో భాగ్యవశమున శ్రీరామచంద్రమూర్తే వచ్చెనా యనునట్లు శ్రీరామశరణ్ శ్రీ శ్రీ కుందుర్తి వేంకట నరసయ్యగారు రావటం, వారి పరిచయము కావటం శ్రీరామశరణ్ గారు అత్యంత అభిమానముతో శ్రీమతి ప్రసూనగారికి రామతత్త్వాన్ని గురించి బోధించి రామనామ మహిమను గూర్చి వ్రాయమని ప్రోత్సహించుట జరిగినది. అప్పుడు వీరు "శ్రీరామనామ సుధానిధి" అను పేరుతో యీ గ్రంథమును రచించిరి. దరిమిలా 'రామాయణ కథాల హరి' యందలి అతి సుందరతరమైన సుందరకాండమును గూడ వ్రాయవలెనన్న హనుమంతుడే ప్రేరేపింపగా 'సుందర కాండమును' రమ్యమైన గీత పద్యములతో రచించి రామా ర్పితముగా సాక్షాత్తు శ్రీరామ స్వరూపులయిన శ్రీ శ్రీరామశరణ్ గారికి అంకితమొసంగినారు. శ్రీ శ్రీరామ శరణ్ గారు ఆంధ్రదేశమునకే గాక ఉత్తర భారతమునకు గూడ చిరపరిచితులు. వీరు రామభక్తాగ్రేసరులు. రామ తత్త్వమునుగూర్చి, రామాయణగాథలను గూర్చి చవులూరే టట్లుగానే గాక, పామరుల మనస్సున భక్తి జ్ఞానములు నెల కొనే విధంగా చెప్పెడి వీరి యుపన్యాసములను విననివారు ఉండరు. తులసీదాసు రామాయణము వీరికి అత్యంత ప్రీతి పాత్రము. రామాయణగాథలను గూర్చి రోజులతరబడి నిద్రాహారములు మాని చెప్పమన్నా విసుగు, అలసటలేకుండా చెప్పగల పండితులు. అటువంటి పుణ్యచరితులు

శ్రీ శ్రీరామశరణ్ గారికి యీ "రామనామ సుధానిధి" ని అంకితమీయటం శ్రీమతి ప్రసూన గారి మహద్భాగ్యం.

నేటి కాలానుగుణ్యంగా వ్యవహారాంధ్రములో రచన సాగినది. పెద్దలకేగాక పిన్నలకుగూడ అర్థంఅగు శైలిలో రచన హృద్యంగా ఉన్నది.

రచయిత్రికి వారి కుటుంబమునకు జానకీ శ్రీరామ చంద్రులు సదా ఆయురారోగ్యాభివృద్ధి కలిగించుగాక !

ఇట్లు

భాషాప్రవీణ, కవిరాజ్

వాడపల్లి లక్ష్మీనరసింహారావు

తెలుగు ఉపాధ్యాయుడు

త ణు కు.

# ఆశీస్సులు

ఓం శ్రీ హనుమత్సీతా లక్ష్మణ భరత శతృఘ్న సపరివార
సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీమతి S. S. ప్రసూనగారు రచించిన "శ్రీరామ నామ సుధానిధి మరియు సుందరకాండ" కథాద్వయమందలి ప్రధాన ఘట్టములను హృదయానందకరముగా ప్రకాశింప జేయుచు భక్తిప్రభోదకమై రామనామము అమృతప్రవాహము, అత్యంత మహిమాన్వితమునై ఆబాల వృద్ధులకు పఠన శ్రవణ పారాయణములు సల్పినవారికి ఐహికాముష్మికా ఫలితములనొంది 'రామ' నామస్మరణచే పవిత్రుడగునని పూర్వగాథలు తెలియజేయు అనుభవములు, చీకటినుండి వెలుగు నిచ్చుననియు కూడ యీ గ్రంథ ప్రాశస్త్యము. ఇట్టి పీరి భాషారచన సులభశైలిలో నిత్యపారాయణ కనువుగా మంచి ప్రజ్ఞ, దక్షత, ఒప్పు భాషాకౌశలముతో వీరి పూర్వరచనానుభవాభివృద్ధి శోభిల్లుచున్నది.

"శ్రీరామనామ సుధానిధి, సుందరకాండ" ల గ్రంథాధిష్ఠాన దైవతమగు జానకీ శ్రీరామచంద్రులు ఈ కవయిత్రిగారికి లోకోద్ధారకములగు గ్రంథరచనాదులకు ఇతోధిక శక్తినొసగి పూర్ణాయుష్యాదులతో వీరికుటుంబమును సర్వదా కాపాడి ఆశీర్వదించుగాత యని యీ దేవుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు
కూరెళ్ల సూర్యనారాయణ
శ్రీ బాలాజీ జ్యోతిషనిలయము, వేల్పూరు.

# ఇష్టదేవతా ప్రార్థన

శ్రీకరంబుగ వెలసెను శ్రీనివాసు
కొండకోనల నడుమను కొలువుదీరి
అండదండలు మాకిచ్చి నిండు దయతో
మమ్ముగావగ రావయ్య మహితమూర్తి !

విజయసారథి విజయతే విశ్వరూప
విమలకోమల లావణ్య వేణుగాన
చారుతరచంద్ర చంద్రికాచలితనేత్ర
నందనందన నీకిదే వందనమ్ము !

మహితశోభన శోభిత మంగళాంగ
మనసు మురళిగ నిత్తురా మదనరూప
సుందరాధర నీ వేణుసుధలు కురిసి
పల్లవించెడు నాజన్మ భవ్యమగును !

వేడుకొందుర నాస్వామి వేంకటేశ
కమ్మనయినట్టి కయితలు కరుణతోడ
నాదుమనమున నిలుపరా నయముగాను
పాటలల్లెద నినుగూర్చి ప్రాణసఖుడ !

ఎన్నొ కావ్యాలు రచియించి ఎలమితోడ
భక్తి మీరగ నీకిచ్చు భాగ్యమిమ్ము
అక్షరంబుల నీరూపు హత్తుకొనగ
కావ్యరచనలు గావింతు కమలనాథ !

నేను వ్రాసినదేదైన నీదుకొరకె
నేను పలికినదేదైన నిన్నుతలచె
నేను చూచినదేదైన నీవుగానె
కల్లకాదుర నాస్వామి కామజనక !

ప్రణయ ప్రణవాలు నీనామ పదవులగును
నిన్నుమరువను నాస్వామి నిజముగాను
బ్రతుకు ఫణముగ నీమ్రోల పరచినాను
వేయిదీవెన లివ్వరా వేంకటేశ !

ముందు కేల్మోడ్చి తలచుచు మోదమలర
విఘ్నరాజును మ్రొక్కెద వేడ్కమీర
సకలదేవతలను భక్తి సన్నుతించి
భారతీదేవికిత్తు నా వందనములు.

రమ్యమయినట్టి కావ్యము రామగాథ
రమ్యమిథునము జానకీ రాములరయ
రమ్యమాధుర్య మహితము రామపదము
రామనామమ్ము వ్రాసెద రమ్యముగను.

శ్రీరామ

# తారకము

శ్రీరామ నామ సుధను మీరు గ్రోలరండీ
రామనామ మహిమ తెలుసుకోనగరండీ
భక్తి ముక్తిదాయకం శక్తినిచ్చు తారకం
తలచినంత తరింపజేయు రామనామతారకం
వాయుపుత్ర సేవితం వసుధయంత పావనం
పాపములను పరిహరించు రామతారకం. ॥శ్రీరామనామ॥

మునులెల్ల మనసునిలిపి ముక్తినొందు సాధనం
రామదాసు బాధలెల్ల నోమినట్టి తారకం
త్యాగరాజు గానలహరి తొణికినట్టితారకం
నామదేవు మనసునందు నాట్యమాడె తారకం
పోతరాజు గంటమందు పోసె తేనె తారకం. ॥శ్రీరామనా॥

రాతిలోనన్నయట్టి నాతియొక్క పాతకమును
బాపినట్టి పాదములకు భక్తితోను శిరముదాల్చి
రామరామరామ యనుచు - రామనామ సుధనుగ్రోల
రండీ రా రండీ - రామనామ సుధనుగ్రోల రండీ.

శ్రీరస్తు

# శ్రీరామ నామ సుధానిధి

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సపరివార సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీ రఘువరుని నామమ్ము సింధువట్లు
పొంగి మధువును ఎగజిమ్మె నింగిదాక
అట్టి మాధుర్యనామమ్ము అందరకును
భక్తి ముక్తిని కలిగించి వరలునటుల
కోరి రచియించె వాల్మీకి కూర్మినార.

శ్లో॥ కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్.

కవిత్వమను శాఖపై కూర్చుండి, మధురమైనదియూ, మధురాక్షరములు కలదియు నగు రామనామమును మధుర స్వరములతో బలుకు వాల్మీకి యను కోకిలకు నమస్కరించు చున్నాను.

వాల్మీకి కవి వసంత కోయిలవలె తన మృదుమధుర మైన కంఠాన్ని సారించి 'రామా - రామా' అన్న కుహూ రవాన్ని గానంచేసినప్పుడు ఆ పాతమధురము, ఆనందరసధుని 'రామా' అన్న రెండక్షరాల్లోనుండి జాలువారి ముల్లోక వాసుల గుండెల్ని పులకరింపజేసి_అంతటి ఆనందాన్ని తమకు కలిగించిన వాల్మీకి కవిశేఖరునకు శతకోటివందనాలు అర్పించారు. వాల్మీకికవికి రామగానంతో తృప్తికలుగలేదు,

శ్లో॥ వాల్మీకిగిరిసంభూతో - రామాంభోనిధి సంగతో
శ్రీమద్రామాయణీగంగా పునాతి భువనత్రయం.

వాల్మీకికవి హిమవన్నగములాగె మహోన్నతముగా పెరిగి ఆ యున్నతమైన గిరిశిఖరాన్నుండి శ్రీమద్రామాయణ మను పేరొందిన మహాకావ్యం గంగానదివలె ఝరీవేగంతో ప్రవహింప చేశాడు. ఆ పవిత్రమైన రామాయణ గంగా ప్రవాహం ముల్లోకాలు ప్రవహించి పునీతంచేసి 'రామ' అను మహాసముద్రంలో కలిసింది. ఈ పవిత్రమైన రామా యణ కావ్యగంగ ముల్లోకవాసుల్ని పునీతముచేయుటకు

కారకుడైన కవిశేఖరులు వాల్మీకిమహర్షికి శతకోటి వందనములు.

ఈ విధంగా రామాయణమనే కావ్యం పవిత్రమైన గంగానదివలె ముల్లోకములను ముంచివేసి పవిత్రవంతం చేసింది, అతిపవిత్రము, శుభప్రదము, ముక్తిమంతము అయిన శ్రీరామాయణ మహాకావ్యాన్ని స్వర్లోకవాసులు, భువర్లోకవాసులు ఎందరెందరో గానంచేసి, పఠించి, విని, ఆనందరసవాహినిలో మునిగి ముచ్చటపడి పఠించి చరితార్థులైనారు. ధర్మసంస్థాపనార్థం శ్రీమన్నారాయణుడు కౌసల్యాదశరథుని పుత్రుడుగా జన్మించినట్టి శ్రీరామచంద్రుని కమనీయమైన గాథే శ్రీమద్రామాయణము.

శ్రీమన్నారాయణుని దశావతారాలన్నింటిలోనికి ధర్మము, శాంతము, ప్రేమ, కరుణ, వీరత్వము మూర్తీభవించిన రఘురామావతారమే మహనీయము, మహోత్కృష్టమైనదని విజ్ఞులు చెప్పెదరు కాబట్టే వేలకువేల సంవత్సరాలు గతించినను మానవహృదయాలలో అతిపవిత్రమును. అతిమనోజ్ఞమైన గాథగా రాముని గాథ నిల్చిపోయినది. గంగానది తాను ప్రవహించినంతమేర సస్యశ్యామలము పునీతముచేసినట్లే, శ్రీమద్రామాయణ మహాకావ్యం పఠించినను, వ్రాసినను, విన్నను వారి హృదయాలలో పునీతమైన గంగానదివలె ప్రవహించి మనస్సులలోని మాలిన్యాన్ని కడిగివేసి దయా శాంతగుణములను కలిగించి భక్తిభావముతో బ్రతు

కాను భగవంతుని చేరగలిగేమార్గం సుగమము చేయగలదు. అంతటి మహత్తరమైన శక్తి గలదికాబట్టే రామాయణ మహా కావ్యము ఆచంద్రతారార్కము నిలిచెడు గొప్ప కావ్యము అయినది. ఎన్నిసార్లు విన్నప్పటికీ వినుగుజనించదు. సరిగదా మళ్ళీమళ్ళీ వినాలన్న కుతుహలాన్ని పెంపొందిస్తుందికూడ. అంతటి గొప్పకావ్యమయిన రామాయణానికి కథానాయకీ నాయకులు సీతమ్మవారు శ్రీరామచంద్రులు, సాక్షాత్తూ శ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణుల అవతారమూర్తులే. అందువల్లనే రామాయణానికి అంతటి ప్రశస్థికలిగినది. సీతా రాములను భక్తిభావంతో ఒక్కసారి తల్చుకుంటే చాలు మనస్సునిండా మధువునిండి పులకితమైపోతుంది. రామునికన్నా రామ నామమే ఎంతో గొప్పదని, ముక్తిదాయకమనీ అంటారు. శ్రీరాముని పాదాలుసేవించి శ్రీరామనామాన్ని జపించబట్టే వాయుపుత్రుడు అంతటి బలవంతుడు, అంతటి పవిత్రుడుఅయినాడు. విభీషణ సుగ్రీవాదులు రామనామాన్ని జపించే తరించారు. ఆనాడేకాదు కలియుగంలోకూడ కబీర్ దాసు, రామదాసు, త్యాగరాజు మొదలైన ఎందరో మహా నీయులు రామతారక మంత్రాన్ని జపించి తరించారు. రామాయణాన్నిగూర్చి ఎంత చెప్పినా తనివితీరని మాధురి లహరి రామనామాన్ని జపించేవారి మనస్సులో నిరంతరము ఊరేనీటిబుగ్గలాగ రామనామము అమృతవాహినియై మన స్సును మాధురీమంతముచేసి, భక్తిభావములనే కెరటాల్ని

ఎగజిమ్మి భగవంతుని మధురమైన రూపరసగుణాల్ని హృదయమంతా ప్రవహింపజేయును.

ఎందరెందరో మహనీయులు, ఋషులు, భక్తవరేణ్యులు రామనామ మహాత్మ్యాన్ని గూర్చి గొంతెత్తి కొనియాడి పామరుల మనస్సుకు హత్తుకునేటట్లు చెప్పియున్నారు.



# ఉత్తర రామచరిత్ర

శౌనకాది మహామునులు, భగవంతుని ప్రసన్నము చేసి కొని ముక్తినొందే సులభోపాయము జెప్పుమని అడుగగా సూతమహాముని వారి కీవిధముగా జెప్పినారు :

"యోగులు ఇంద్రియాల్ని అరికట్టి విషయాసక్తుల్ని జయించి ఆహారనియమాలు పాటించుచు కఠినమైన సాధన చేయుచు ఎన్నో జన్మలకుగాని స్వర్గాధికారాన్ని పొందలేరు. వారి మార్గం ఎంతో కఠినమైనది. అలాకాక భక్తులమార్గము చాలా సులభమైనది. వారు అడవులకు వెళ్ళనక్కరలేదు. ఆహారనియమాలులేవు. కేవలము భక్తిభావముతో భగవంతునిపట్ల మనసు నిలిపి తాము చేసే అన్నిపనులు శ్రీరామ చరణాలకే అర్పితముచేసినా, వంటచేసినా, తినినా, పూలను తెచ్చినా, ఏపనిచేసినా శ్రీరాముని కొరకే అన్న భావంతో భక్తితత్పరులై నిరంతరం భగవత్ ధ్యానంలో మునిగి చివ రకు మరణసమయంలోకూడా 'రామా-రామా' యని స్మరిస్తూనే మరణించెదరు. అలాంటివారికికూడా కఠినమైన నియమాలతో సాధనచేసిన యోగులకు లభించేముక్తియే వీరికి గూడ లభించును. ఒకొక్కప్పుడు యోగులకన్న ముందుగనే వీరికి పరమపదము లభించును. ఎందువల్లనంటే కఠినాతికఠిన మైన నియమాలకన్నా పవిత్రవంతమయిన మనస్సుతో భగ

వంతుని ధ్యానించుటయే భగవంతుని చేరగలిగే సులభ మార్గము. అటువంటి సులభతరము, ముక్తిమార్గము పొంద వలెనన్న ముందుగా భగవన్నామాన్నిగూర్చి తెలుసుకోవాలి ఏవస్తువుమీదనైనా అభిమానం కలగాలంటే ఆ వస్తువు యొక్క మహిమనుగూర్చి ముందుగా తెలుసుకోవాలి. ఎందు కంటె వస్తువువిలువ తెలియనట్లయితే, ఆవస్తువును వినియో గించి ఫలితాన్ని పొందాలనే ఆశక్తి కలుగదు. కాబట్టి మీకు ఇప్పుడు 'రామ' నామ మహిమనుగూర్చి విన్నవిస్తాను.

'రామ' అన్న రెండక్షరములలో ఎంతయో గొప్ప బలమున్నది. అంతేగాదు, మనస్సులను అయస్కాంతము లాగ భగవంతునివైపు ఆకర్షించే అమోఘమైన శక్తికూడ ఉన్నది. రామనామము ఎంత పావనమయినదో నోటితో ఉచ్చరించ జాలనిది. ఎంతటి దుర్మార్గపు పనులుచేసిన అతి పాపియైనను, ఒక్కసారి "రామా" అని జపించినట్లయిన అతని పాపములన్నియు సుడిగాలిలో ఉలిపిరికాగితాలవలె చెల్లాచెదరుగా ఎగిరిపోతాయి. కేవలం భక్తిభావంతోనే ఉచ్ఛరించకపోయినా ఇష్టములేకుండా వినినప్పటికిగూడ పాప పరిహారమగును. ఇది ఎలాగంటే, రోగగ్రస్తుడయినవాడు వైద్యుడిచ్చిన మందుయొక్క గుణగణాల్ని తెలుసుకోకుండా సేవించి ఎలా రోగవిముక్తి చెందుతాడో అల్లాగే అతిమధు రము, శక్తిమంతము, ముక్తిదాయకమయిన రామనామము చెవినిబడినంతనే పాపియొక్క పాపములన్నీ పరిహారింపబడి

పోతాయి. అలాంటప్పుడు రామనామ ప్రభావాన్నిగూర్చి తెలుసుకొని భక్తితో, అనురక్తితో తలచినట్లయితే, అలాంటి వారి పుణ్యమేమని చెప్పగలము? రామచరితము అపార మధురము, మనోల్లాసము, కర్ణానందము కలిగించునది. రామునియొక్క స్వభావ రూప గుణ శీల లీలలు విన్నకొలది మధువులూరుచు ఇంకా ఇంకా వినవలెననే కుతూహాలాన్ని రేకెత్తించును. 'రామ' యని ఒక్కసారి స్మరిస్తే చాలు మనస్సులో మలినభావాలన్నీ తొలగి. స్వచ్ఛము సరళము అయిన భావధృతి కలుగుతుంది. చిల్లగింజను బురదనీటిలో వేసిన బురదఅంతా అడుగునకుపోయి నీరంతయూ నిర్మల ముగా నగును. అల్లాగే రామచరిత్ర విన్నప్పుడు ఆ మధుర మైన రామనామము చెవులగుండా హృదయములో ప్రవేశించి అక్కడజేరిన చెడుభావాలన్నిటిని బైటకు తరిమివేసి స్వచ్ఛ మైన సలిలములాగా రామనామామృతమే హృదయమంతా నిండిపోతుంది. కాబట్టి భక్తితత్పరులై సాకూత్తు నారాయణ స్వరూపుడైన రాముని సేవిస్తూ రాముని కథలువింటూ, రామ నామాన్ని జపించుటయే తరించుటానికి సులభ మయిన మార్గము. తారకమంత్రాన్ని మించి తరింపజేసే మంత్రము యీ మూడులోకాలు వెతికినా కనబడదు. అని శౌనికాది మహామునులకు బోధచేసినాడు సూతమహర్షి.

త్రిలోకసంచారియగు నారదుడు ఒకసారి సనత్కు మారుని ఆశ్రమమునకు వెళ్ళగా సనత్కుమారుడు ఎంతో

సంతోషముతో నారదునికి అర్ఘ్యపాద్యాదుల నిచ్చి సుఖాసీనుని గావించి "మహాభాగా! నారదా! మీరు యీ త్రిభువనాల్లోనూ ఎల్లప్పుడు సంచరిస్తునే వుంటారు. మీకు తెలియని సంగతే యుండదు. అతిపవిత్రము, అతిమధురము, అత్యంత మాహాత్మ్యముకలిగిన మంత్రమేది? కఠోరతపస్సు, యజ్ఞయాగాదులు చేయలేని మానవులు తరించే మార్గమేది?" అని అంజలిబద్ధుడై అడిగెను. అప్పుడు నారదుడు సనత్కుమారునితో "సకల శ్రుతిస్మృతి పురాణ కావ్యాలలో నుత్తమమైనది శ్రీమద్రామాయణ మహాకావ్యం. సకల మంత్రాలలో ఉత్తమోత్తమైనది రామమంత్రము. సకలనామాలలోను మహిమాన్వితమైనది రామనామము. రామనామాన్ని మించిన పవిత్రనామము ఈ త్రిభువనాలలో లేదు. ఎంతటి ఘోరపాపములు చేసినను ఒక్కసారి నోరారా "రామా" అన్న మాత్రాన పటాపంచలై పోతాయి. సోమదత్తుడనే ఒక బ్రాహ్మణుడు శాపవశాన బ్రహ్మరాక్షసుడై జన్మించి పవిత్రమైన రామాయణకథ వినినంతనే అతని బ్రహ్మరాక్షసత్వముపోయి తిరిగి యథారూపమును పొందుటయేగాక ముక్తినిగూడ పొందెను." అని చెప్పగా సనత్కుమారుడు "స్వామీ నారదా! ఆ సోమదత్తునికి శాపమెట్లు కలిగెను? ఏవిధంగా దాని నివారణ గలిగెను? ఆకథను నాకు వివరముగా చెప్పుమని అడుగగా నారదుడీ విధముగా చెప్పసాగెను.

"పూర్వము గంగాతీరమున గౌతమమహాముని నివాస మేర్చరుచుకొని తపస్సు, యజ్ఞ, యాగాదులు జేయుచు శిష్యు లనేకమందిని జేర్చుకొని వాత్సల్యపూరితంగా వారికి అనేక శాస్త్రవిద్యా రహస్యములు బోధించుచు ప్రశాంతముగా కాలము గడుపసాగెను. గౌతమముని శిష్యులలో సోమదత్తు డను నొక బ్రాహ్మణుడుండెను. ఆతడు గౌతమ మునివలన అనేక విద్యల నభ్యసించి గొప్పపండితుడయ్యెను. క్రమముగా ఆతనిలో తానే అందరికన్న గొప్పవిద్వాంసుడనని, శాస్త్ర రహస్య ప్రవీణుడననే గర్వముకలిగి గురువునుకూడ లెక్క చేయనంతటి అహంభావుడయ్యెను. ఒకరోజున సోమదత్తుడు తన నివాసములో శివుని పూజచేయుచుండెను. ఆ సమయ మున అతని గురువగు గౌతమమహర్షి సోమదత్తునితో ఏదో చెప్పవలసి ఆతని నివాసమునకు వచ్చెను. గురువు వచ్చుట గమనించియు సోమదత్తుడు గురువును సత్కరించక చూడ నట్లే శివపూజానిమగ్నుడాయెను. గౌతముడు తన శిష్యుని నిర్లక్ష్యానికి, అమర్యాదకు మనస్సులో కంచిత్తు విచారించినా పైకి ఏమియు అనక, మౌనము వహించెను. కాని సోమదత్తుని పూజలందుకొంటున్న పరమశివునికి గొప్పకోపము గలిగెను. తనకు విద్యాభిక్షపెట్టిన గురువును గౌరవించలేనివానికి దైవా రాధనకు అర్హతలేదని 'నీవు బ్రహ్మరాక్షసుడవై బుట్టుదువుగాక' అని శాపమిచ్చి అంతర్ధానమయ్యెను. అప్పుడు సోమదత్తుడు తన గర్వమంతయు పోగా పశ్చాత్తాపముతో గురువు పాదాల

మీదపడి తన తప్పును క్షమించుమని శాపవిమోచనమార్గం చెప్పుమని అనేకవిధముల గౌతముని వేడుకొనెను. గౌతముడు వాత్సల్యపూరితుడై ఆతని లేవనెత్తి 'సోమదత్తా! ఎంతటి వారికైనా గర్వం చేటు తెస్తుంది, గురువుని అవమానిస్తే గురువు క్షమించినా భగవంతుడు క్షమించడు. నీ విద్యాగర్వమే నీకింత చేటు తెచ్చినది. పరమశివుని శాపమునకు తిరుగులేదు. కాని నీకు నేనొక ఉపాయము చెప్పెద వినుము.

నీ కీ రాక్షసత్వం పన్నెండు సంవత్సరాలుండును. పంన్నెడవ సంవత్సరం ముగియు రోజుల్లో 'రామ' నామాన్ని జపించే ఒక బ్రాహ్మణుడు నీవున్న ప్రాంతాలకు రాగలడు. ఆతనివలన నీవు పవిత్రమైన రామాయణగాథను వినుము. సకల పాపభంజనమైన శ్రీరామ కథను విన్నంతనే నీకు పాప విమోచనం కలుగుతుంది" అని చెప్పెను. సోమదత్తుడు గౌతమమునికి నమస్కరించి అడవులలోనికి వెళ్ళెను వెంటనే శివ శాపంవల్ల నాతడు రాక్షసుడయ్యెను. గతజన్మను మరిచి రాక్షసభావంతో ఆతడు అనేక దుర్మార్గపు పనులుచేయుచు, వనములో ప్రశాంతముగా జీవించు మునులను, మానవులను అనేక విధాల పీడించి బాధించుచు తన చేతికిచిక్కిన జంతుజాలాన్ని, మానవులను పట్టి తినుచు క్రూరమైన జీవితాన్ని గడపసాగెను. ఈవిధంగా పదకొండున్నర సంవత్సరాలు గడిచెను. పన్నెండవ సంవత్సరము ముగియు రోజుల్లో ఒక నాడు ఆ రాక్షసునికి ఆహారమేదీ దొరకలేదు. ఎంత ప్రయ

శ్రించిననూ ఒక చిన్న జంతువయినా కనబడకపోవుటవలన ఆకలితో పెడబొబ్బలు పెట్టుచు తిరుగుచుండగా ఆ రాక్షసునికి సుదూరంలో ఒక బ్రాహ్మణుడు కనుపించెను. అతనిని చూడగనే రాక్షసుడు పరమానందంగా కడుపునిండా నరమాంసము తినవచ్చునని ఆతనిని పట్టుకొనుటకు అంగలు వేయుచు ముందుకు వెళ్ళబోగా ఆ రాక్షసునికి అడుగు ముందుకు పడలేదు. తనలో శక్తినంతా ఎవరో పెకలించివేసినట్లుగా శరీరమంతయు శక్తిహీనమైపోయెను. రాక్షసుడు తనలో వచ్చిన మార్పునకు క్షణకాలము నివ్వెఱపోయి బలమంతా కూడదీసుకొని 'ఓ మనుష్యుడా! నీ వెవ్వడవు? మాయలమారి మాంత్రికుడవా? ఎందరో బలశాలుల్ని నా వాక్కు-పిడికిలి పోటుతో నేలకరిచేటట్లు చేసే నాశక్తిని ఇంత నిర్వీర్యం చేసింది నీవేనా? ఏ మంత్రంతో నన్నిలా కట్టివేశావు?" అని దీనంగా అడుగగా ఆ బ్రాహ్మణుడు 'ఓ రాక్షసుడా! నా పేరు గర్గుడు. నేను బ్రాహ్మణుడను. ప్రయాగలో స్నానంచేసి గంగాజలాన్ని తీసుకొనివెడుతున్నాను. ఏమాయలమారి మంత్రముతోనూ నిన్ను కట్టివేయలేదు. నేను నిరంతరం పరమపావనమైన రామనామాన్ని జపిస్తూఉంటాను. రామనామ మహిమ ఇట్టిదని చెప్పుటకు ఎవ్వరికినీ సాధ్యంకాదు. ఆ నామ మహిమయే నీలోని క్రూరత్వాన్ని జయించినది" అని చెప్పెను. ఆ బ్రాహ్మణుని మాటలు వినినంతనే ఆ రాక్షసునకు పూర్వస్మృతిగలిగి

అమాంతంగ గర్గుని పాదాలమీద వ్రాలి 'స్వామీ! మహానుభావా! నా తప్పులు క్షమించండి; నేను సోమదత్తుడనే బ్రాహ్మణుడను. గౌతమ మహర్షి శిష్యుడను. విద్యాగర్వముతో గురువును అవమానించుటచే శివునివల్ల నాకు శాపము కలిగి రాక్షసుడనై అనేక క్రూర కర్మలు చేసినాను. నేటికి మీ దర్శనభాగ్యంచేత నా జన్మ ధన్యమైనది. పవిత్రమైన రామాయణకథ వినినంతనే నాకు శాపవిముక్తి కలుగునని మా గురువుగారు చెప్పిరి. కాబట్టి, విప్రోత్తమా! తమరు వేదవేదాంగ వేత్తలు, పరోపకారులు, దయార్ద్ర హృదయులు, నామీద దయయుంచి పాపపరిహారాన్ని కలిగించే మధుర మనోహరమైన శ్రీరామకథను నాకు చెప్పుడు' అని దీనవదనుడై ముకుళిత హస్తాలతో సోమదత్తుడు వేడుకొనగా, గర్గుడు మహదానందంతో రామచరిత్రను మనోహరంగా వినిపించెను. రామచరిత్ర వినినంతనే సోమదత్తునకు రాక్షసత్వము వదలినది మహాతేజశ్శాలియై వెళ్లి గర్గునకు నమస్కరించి వైకుంఠమునకు పోయెను.

అలాగే మహాపాపియగు ఒక శూద్రుడుగూడ రామాయణాన్ని విని ముక్తినొందెను. ఈవిధంగా రామాయణాన్ని విని తరించినవారెందరోకల'రని నారదుడు చెప్పగా 'నారదా! ఆ శూద్రుని కథగూడ చెప్పి నాకు పుణ్యం కలుగ జేయండి' అని సనత్కుమారుడు అడిగెను. అంత నారదుడు ఆ శూద్రుని కథ చెప్పసాగెను.

పూర్వము మాళవదేశము నొకప్పుడు సుమతి యను రాజు పరిపాలించుచుండెను. అతడు గొప్ప ధార్మికుడు, సత్క్రియాపరాయణుడు, తేజశ్శాలి ప్రజల్ని కన్నబిడ్డలవలె చూచుచు న్యాయ నిరతితో ప్రజాపాలన చేయుచుండెను. అతని భార్య సత్యవతి భర్తకు తగిన ఇల్లాలు, దయాశీలి, పతివ్రత. ప్రజలపట్ల ఆమెకున్న కరుణ ఇంతింతయనరానిది. ఆ రాజు రాణిపట్ల ప్రజలకు గాఢమైన భక్తి, అభిమానము. రాజాజ్ఞను జవదాటకుండ భక్తిశ్రద్ధలతో రాజుకు అన్ని వేళల సహకరించుచుండేవారు. రాజు ధర్మవర్తనుడు, ప్రజలు న్యాయ వర్తనులయితే ఆ రాజ్యంగానికి కొదవేమిటి ఆ విధంగా సుమతి రాజ్యం సుభిక్షంతో కలకలలాడుతూఉండేది. రాజు-రాణి కాలాన్ని వృధాకాలక్షేపంతో వ్యర్థపుచ్చేవారుకాదు. రాజ్యపాలనకు మంత్రాంగాలకుపోగా మిగిలిన కాలమంతా వారు రామాయణాన్ని వినుటకే వినియోగించేవారు. వారి నాలుకమీద సర్వకాల సర్వావస్థలయందు రామనామం ఉచ్చరింపబడుతూనే ఉండేది, అలావుండగా ఒకనాడు విభాండక మహాముని తన శిష్యులతో సుమతి రాజ్యంగుండా పోవుచు రాజును చూచి ఆశీర్వదించి వెళ్ళవలెనని రాజగు సుమతి కడకు వచ్చెను. రాజు ఎంతో సంతోషించి తన రాణి సత్యవతితోగూడ ఆ ముని కెదురేగి భక్తితో అర్ఘ్య పాద్యాదులిచ్చి సుఖాసీనుని గావించి, అతని తపస్సును గురించి, యజ్ఞయాగాదులను గురించి, ఆశ్రమవాసాన్ని

గురించి అనేకవిధాల క్షేమసమాచారములడిగి 'స్వామీ! ఏమి అనుజ్ఞ? ఈ దాసుడు మీ అనుజ్ఞకై వేచియున్నాడు, ఏమి కోరి తాము వచ్చినారో సెలవిండు' అని దోసిలొగ్గి తలవంచి వినయంగా అడిగెను. విభాండక మహాముని చిరునవ్వుతో రాజును జూచి "రాజా! నీకు శుభమగుగాక! నేను నీరాజ్యంగుండా పోతూ నిన్ను చూచిపోదామని వచ్చినాను. ప్రత్యేకించి ఏ కోరికతో రాలేదు. రాజా! నీ ఆతిథ్యానికి నాకు చాల సంతోషము కలిగినది నీవు, అనుకూలవతియైన నీ భార్య చిరకాలం ఆయురారోగ్య సంపన్నులై వర్ధిల్లుడు. రాజా! నాదొక సందేహము. నీ రాజభవనం నుండి ఎల్ల వేళలా రామాయణ కథాగానము వీనులవిందుగా వినవస్తూంటుంది. ఎప్పుడు నీవు రామాయణాన్నే వినుచుందువా? పలురకాల పురాణాలు, ఇతిహాసాలు, శాస్త్రాలు ఉండగా రామాయణం ఒక్కటే ఇంత శ్రద్ధగా వినెదవేమి?" అని విభాండకముని అడుగగా రాజు చిరునవ్వుతో అంజలిబద్ధుడై 'స్వామీ! అన్నియు తెలిసిన మహానుభావులు. మీకు చెప్పవలెనా? ఎవరికి దేనివల్ల పనిజరుగునో దానినే గౌరవింతురుగదా! ప్రపంచములో ఒకరిని మించిన మహానుభావులు మరియొకరుందురు. కాని మనకు మేలుచేకూర్చి మన హృదయాన్ని ఆకర్షించినవారి పట్లనే మనకు ప్రేమ ఎక్కువగా ఉండుట సహజమేగదా! అవిధంగానే నాకు పూర్వజన్మమందు రామాయణ శ్రవణంవలన ఎంతో శుభ

కరమైన మేలు జరిగింది. రామాయణ శ్రవణం తప్ప నా జీవితంలో చేయదగిన ప్రీతికరమైనపని ఏమీ లేదన్నట్లు రామాయణగాథ నాహృదయంలో ముద్రితమైనది. మహానుభావా! రామాయణ కథామహాత్మ్యాన్ని గురించి మీకు నేను చెప్పదగినవాడనా? మీ ముందు అల్పుడను. ఏమో తెల్సినట్లు మాట్లాడుతున్నాను క్షమించండి" అనెను. అప్పుడు విభాండకముని చిరునవ్వుతో 'రాజా! రామాయణ శ్రవణ మాహాత్మ్యాన్ని ఎందరో ఎన్నివిధాలుగనో కొనియాడి యున్నారు. ఎన్నిసార్లు విన్ననూ మరల మరల వినవలెనను కుతూహలాన్ని కలిగించెడి రామకథ నీకు ఏవిధంగా మేలు కలిగించెనో! నీనోటనే వినదల్చుకున్నాను. కాబట్టి సంశయించక నీ పూర్వకథ చెప్పు" మని అడుగగా సుమతిరాజు ఇట్లు చెప్పసాగెను.

"నేను పూర్వజన్మమున 'మాలిని' అనే శూద్రుడను. కులవృత్తిపట్ల నిర్లక్ష్యాన్ని చూపుచూ చిన్నతనంనుండీ చెడు సహవాసములతో చెడుపనులు చేయుటకే అలవాటుపడితిని, నన్ను మంచిమార్గములో పెట్టుటకు మాపెద్దలు ఎంతో ప్రయతించినారు. కర్మవశాన వారిమాటలు నా చెవికెక్క లేదు. వయస్సు పెరిగినకొలది నాలో దుష్టభావము వేయింతలుగా పెరిగి 'ఇది చేయవచ్చును, ఇది చేయరాదు' అన్న వివేకము నసించి క్రూరమైన పనులు చేయుటకు, సాధువులను హింసించుట, చోరత్వమే ఆనందమైన పనిగా నెంచి, దొంగి

లించిన డబ్బుతో మద్యమాంసములు సేవించి గణికలతో రేయింబవళ్లు గడుపుచూ నీచజీవితానికి అలవాటుపడితిని. చివర చివరికి మాంసమే ఆహారంగా మద్యమే పానీయంగా మారి విషయలోలుడను కావటంతో ఎంతడబ్బు చాలక స్త్రీ, బాల, వృద్ధ వివక్షతలేక కనిపించినవారిని నిర్దాక్షిణ్యముగా చంపివేసి వారినుండి దొరికినంత దోచుకునేవాడిని. నా హింసాచర్యల్ని భరించినంతకాలం భరించి, ఇంక సహించ లేక నా బంధువులు, నా ఊరి జనులు ఒక్కటై నన్ను నా యూరినుంచి దూరముగా తరిమివేసి నా పీడ వదిలించుకు న్నారు. నేను తినటానికి, త్రాగటానికి ఏమీ దొరకక బాధ పడుతూ అడవులలోనే చేతికందిన జంతువులను చంపి పచ్చి మాంసమే తింటూ తిరిగి తిరిగి వశిష్ఠ మహాముని ఆశ్రమానికి చేరుకున్నాను. ఏదోశక్తి నన్ను వెంటనుండి కదలకుండ చేసింది ఆ పవిత్రాశ్రమం ప్రాంతాలలోనే ఒక పర్ణకుటీరం వేసికొని ఆ దగ్గరలోనున్న అడవిలోని జంతువులను వేటాడి వాటి మాంసమును వండుకొని తిని కాలం గడపసాగాను.

ఇట్లుండగా ఒకనాటి రాత్రి నేను పరుండియుండగా ఆ వనప్రాంతాలనుండి స్త్రీరోదనధ్వని వినిపించెను. నేనొక్క వుదుటన లేచి వెతుకుచు వెళ్లగా కొంతదూరంలో దట్టమైన చీకట్లు అలుముకున్న ఒక విశాలమైన చెట్టుక్రింద ఒక స్త్రీ కూర్చుండి హృదయవిదారకంగా ఏడ్చుచుండెను. ఏనాడూ ఎవ్వరి ఏడ్పునకు చలించక క్రూరముగా ఎందరో మనుష్యు

లను హత్యచేసిన నేను, ఆ స్త్రీ దీనాలాపాలకు కదిలిపోయి నా మనస్సు జాలితో నిండిపోయింది. ఆమెను ఓదార్చుచు నీ వెవ్వరివమ్మా, ఎందుకిలా ఇంత రాత్రివేళ ఇక్కడ ఒంటరిగా కూర్చుండి ఏడ్చుచున్నావు? నీవారెవ్వరు? నీయూరేమి?' అని నేను ఎన్నో విధముల బ్రతిమాలి అడుగగా ఆమె ఇంకా ఏడ్చుచు, అభాగిని అయిన నా సంగతి మీకెందుకు? మీవంటి వారి దయపొందే అర్హత నాకులేదు. నాదారిన నన్ను పోనియ్యండి అనెను. నేను బలవంతము చేయగా ఆమె "నా కథ వినరానిది అతి పాపురాలను. నా పేరు 'కాల' శూద్రజాతిదాన్ని. సజ్జనుడైన నా భర్త కళ్ళు కప్పి వ్యభిచరిస్తూ ఆ పాపం చాలక విటుల దుర్బోధలు విని పాపభీతిలేక భర్తను హత్యచేశాను. నా క్రూరమైన పనులకు శిక్షగా నాయూరివాళ్లు నన్ను ఊరు వెడలగొట్టేరు. భర్తను చంపుమని ప్రోత్సహించిన నా విటులెవ్వరూ నా కష్టసమయములో సహాయపడలేదు. నాలాంటి దుర్మార్గురాలికి ఇది తగిన శిక్షేనని అడవిలో ఏ జంతువు వాతఅయినా బడి చావవలెనని ఇలా తిరుగుచున్నా"నని చెప్పెను. ఆమె కథవిన్న నేను విచారించి మా ఇద్దరి జీవితకథలు ఒక్కమాదిరిగనే వున్నవని, దేవుడే ఇలా కలిపేడేమోనని మనస్సులో అనుకొని 'కాలా! జరిగినదానికి విచారించకు; ఒక కుంటివానికి ఒక కుష్ఠువానికి జతచేసినట్లుగా దేవుడే మనల్ని కలిపేడు. కాబట్టి మనము ఒకరికొకరు తోడుగా జీవిద్దాం' అని నేను

అనగా ఆమె అంగీకరించి నాతో వచ్చినది. నాటినుండి నేము భార్యభర్తలవలె జీవిస్తూ కాలం గడపసాగాము; ఇల్లావుండగా ఒకనాడు వశిష్ఠముని ఆశ్రమంలో ఏదో ఉత్సవము జరుగుచున్నది. ఎక్కడెక్కడి నుండియో మహాత్ములు, మునిపుంగవులు వచ్చియున్నారు. ఏదియో సంకీర్తన ఉచ్చైస్స్వరంతో వినరాసాగింది. అది ఏమిటాయని నేను నా భార్య 'కాల' ఆ ఆశ్రమ సమీపంలోకి వెళ్ళి చూచాము. మునులందరూ ధ్యాననిమగ్నులై కనులు మూసుకొని రామనామ సంకీర్తన చేయుచున్నారు. అది ఏమిటో మాకు బోధపడకపోయినప్పటికి మా మనస్సులో మహదానందం గలిగి ఆ ప్రదేశాన్ని విడిచి రాలేకపోయాము. కొంతసేపటికి వారి సంకీర్తన ముగిసింది. వారంతా ఫలహారములుచేసి ఆకులు దూరంగా పారవేశారు. నేనూ, నా భార్య వారు పారవేసిన ఆకుల్లో మిగిలిన ప్రసాదం ఏరుకు తిన్నాము. ఆ ప్రసాద మహాత్మ్యమేమియోగాని మాకు ఇంక మద్యమాంసముల మీాద మనస్సుపోలేదు. ఆకలిదప్పులు మరచి ఆశ్రమప్రాంతంలో మే మలాగే కూర్చుండిపోయాము. పగలు, రాత్రి ఆ మునులుచేయు నామసంకీర్తనమును వింటూ, వారు తిని పారవేసిన ఆకులలోని ప్రసాదం తింటూ గడపసాగేము. వారు రామాయణ పారాయణ చేయసాగారు. మాకు అది అర్థంకాకపోయినప్పటికీ "రామ" అన్న మాట విన్నప్పుడల్లా మా మనస్సులలో ఏదో మధురమైన భావనకలిగి మా

పూర్వజీవితంపట్ల అసహ్యము, పరితాపము కలుగసాగాయి. క్రమంగా మేము ఆహారము, నీరు, నిద్ర మరచిపోయి రామాయణ కథను ఏకాగ్రతతో వినుచు మమ్ము మేమే మరచిపోయాము, చివరకు రామాయణకథ సమాప్తమైనది; ఆరోజుననే మాకు మృత్యువుకలిగెను. మమ్ము తీసుకొనివెళ్ళుటకు యమభటులు రాగా, దేవదూతలు అడ్డునిలిచి యమభటుల్ని మాదరికి జేరనీయలేదు. "మీరేల మాకు అడ్డువస్తారు ? ఈ మాలిని, కాల చేయని పాపకర్మలు లేవు, వీరికన్నా మించిన పాపులులేరు. వీరికి నరకమే గతి. మీరు మాదారికి అడ్డులేవండి; మా యమధర్మరాజుగారి ఆజ్ఞానుసారము వీరినిప్పుడే మేము తీసుకువెళ్ళాలి" అని యమదూతలు దేవదూతలతో అనగా, దేవదూతలు "యమభటులారా ! వీరు ఎన్నిఘోరమైన పాపములు చేసినప్పటికీ చివరిలో పరమపవిత్రమైన రామ కథను విని పునీతులైనారు. ఎంతహీనాతిహీనమైన పాపాలు చేసిన క్రూరుడైనా ఒక్కసారి ఇష్టంగాంగాని, అయిష్టంగా గాని 'రామా' అని నోటితో అనినా, చెవులతో వినినా అతని పాపాలన్నియు పటాపంచలయిపోయి అమృతత్వాన్ని పొందుతారు. అంతటి మహిమాన్వితమైన శ్రీరామ కథా శ్రవణాన్ని పొందిన వీరికి పాపమెక్కడిది ? వీరు అత్యంత పుణ్యాత్ములు, వీరిజోలికి రాక మీదారిన మీరుపొండి" అని యమభటుల్ని తరిమివేశారు. ఓ మాలిని! కాలా! మీరు రామకథా శ్రవణంచేత అత్యంత పుణ్యాత్ములయ్యారు. ఆ

పుణ్యప్రభావంచేత మీరు మరుజన్మలో మాళవదేశానికి రాజు, రాణిగా జన్మిస్తారు. మీరు ధర్మవర్తనులై రాజ్యమేలుచూ నిరంతరం రామాయణకథా శ్రవణంచేత సంచిత పాపాలన్నిటిని పోగొట్టుకొని రామనామ సుధారసపానంతో దేవత్వాన్ని పొంది, పరమపదాన్ని చేరుకుంటారు" అని దేవదూతలు మమ్మాశీర్వదించి అంతర్ధానమయ్యారు.

ఆ పుణ్యప్రభావంచే యీ జన్మలో నేను రాజునయ్యాను. నాభార్య యీమె! ఆజన్మలో కాలయే. స్వామీ! అందువలనే మరల ఈ సంసారములోపడి పాపకర్మలు చేయకుండా పతితపావనమైన రామచరితను నిరంతరం వినుచుందుము" అని సుమతిరాజు చెప్పగా విభాండకముని అత్యంతాదరముతో రాజును, రాణిని ఆశీర్వదించి 'ఓ రాజా! యోగీంద్రులకయినా లభ్యంకాని శ్రీరామ కరుణాకటాక్షము నీకు లభించినది. నీవు ధన్యుడవు; రామకథాశ్రవణ మహాత్మ్యాన్ని నీనుండి విన్న నేనును ధన్యుడనే; సత్ప్రవర్తన, రామకథా సత్కాలక్షేపమువలన పునీతుడవైన నీ భార్యకు పరమపదము లభించుగాక" అని రాజును వీడ్కొని విభాండకముని తన శిష్యులతో తనదారిని బోయెను.

ఆ విధముగానే రామనామ మహిమవలన తరించినవారెందరో కలరు.

ఒకసారి ఒక బ్రాహ్మణుడు ఎచ్చటికో పోవుచూ మార్గాయాసముతో మార్గమధ్యంలోవున్న పాడుపడిన ఒక

మందిరంలో పరుండెను. అతనికి అలసటచే గాఢనిద్రపట్టెను. మెలుకువవచ్చు సరికి నలువైపుల చీకట్లుకమ్ముకొనెను. ఆ చీకటిలో తన దారి తెలియకపోవుటచే ప్రయాణాన్ని విరమించి చేసేది ఏమిలేక రామనామాన్ని జపిస్తూ పరుండెను. అంతలో ఒక దొంగ ఆ మందిరంలో ప్రవేశించి ఆ బ్రాహ్మణునివద్ద ధనమున్నదనే ఆశతో అతనిని చంపజూచెను. కాని ఎత్తిన చేయి ఎత్తినట్టేయుండి చేతిలోనికత్తి జారి క్రిందబడెను. దొంగకు అది పరమాద్భుతముగా కనిపించి ఆ బ్రాహ్మణుని చూచి "నీవెవరవు? మనిషివా? భూతప్రేతానివా? నన్నింత శక్తిహీనుణ్ణిచేసిన నీలోని శక్తిఏమిటి? ఇప్పటికి ఇరువది సంవత్సరములుగా నేనీ చోరవృత్తిలో జీవిస్తున్నాను, నాకు ఎప్పుడూఇలాటి వోటమి కలుగలేదు. నీమాయలు కట్టిపెట్టి నీదగ్గరనున్న ధనమంతా యిమ్ము; లేకున్న నేనుగాకున్న నా అనుచరులైన నిన్ను చంపివేసెదరు" అనెను. వాని మాటలకు ఆ బ్రాహ్మణుడు ఆశ్చర్యపడి కొంతసేపు ఆలోచనామగ్నుడై చిరునవ్వునవ్వుతూ "ఓ చోరశిఖామణీ! నన్ను నీవు చంపనందుకు ధన్యవాదాలు, నాలో ఏమీ మహాత్మ్యములేదు. నేను నీవంటి మానవుణ్ణే! ఏ పిశాచాన్ని కాదు. నీశక్తిని హీనంచేసి, నీప్రయత్నాన్ని పడగొట్టినది నేనుకాదు. పరమపవిత్రమైన రామనామమే. నన్ను కాపాడి, నీశక్తిని హరించింది. 'రామ' అన్న రెండక్షరాలు ఎవరి నాలుకమీద నిరంతరం నాట్యమాడుతూ ఉంటాయో వారికి

భూతప్రేత చోరపాప భయాలేమీయుండవు. రామభక్తుడు మారుతి నిరంతరం రామనామాన్ని జపించేవారిని వెన్నంటి కాపాడుతాడు. ఓ చోరుడా! నన్ను నీవు చంపదలచితే చంపుము. కాని నావద్ద ధనమేమియులేదు. నావద్దనున్నది రామనామసుధయే! అదియే నీకు కావలసిన సంతోషముతో ఇచ్చెద" ననెను. ఆబ్రాహ్మణుని నోట రామనామమహిమ విన్నంతనే ఆ దొంగలో ఆశ్చర్యకరమైన పరివర్తన గలిగి అమాంతం ఆ బ్రాహ్మణుని కాళ్ళమీదపడి "మహానుభావా! మీ మహిమ తెలిసికొనకుండ ఏమేమో అన్నాను. నా వాచాలత్వానికి క్షమించండి. నా గతజీవితాన్ని తల్చుకొని సిగ్గుపడుతున్నాను. ఈనాటినుండి నికృష్టమైన చోరవృత్తిని వదిలివేస్తున్నాను. మీకు ఘోరమైన అపచారాన్ని తలపెట్టేను. మీరు దయాసముద్రులు. నా తప్పును క్షమించి నన్ను మీ శిష్యునిగా జేర్చుకొని పరమపవిత్రమైన రామనామ మహిమను బోధించి నన్ను కృతార్థుని చేయండి. ఇకనుండి భగవత్సేవలో, మీ సేవలో నా జీవితాన్ని గడుపుతాను" అని వేయివిధాలు పరితప్త హృదయంతో ఆ బ్రాహ్మణుని వేడుకొన్నాడు. ఆబ్రాహ్మణుడు అంతులేని ఆనందంతో ఆదరంతో ఆ దొంగను చేరదీసి "నాయనా! ఎంతటి పాపులనయినా పావనమైన రామనామం పునీతుల్ని చేస్తుంది, అమృతోపమానము, అనిర్వచనీయమైన పరమపవిత్రమైన రామనామాన్ని జపించి పుణ్యుడవుకమ్ము' అని ఆదొంగకు రామమం

త్రాన్ని ఉపదేశించి శాశ్వతమైన పరమపదాన్ని చేరుకునే మార్గం చూపించెను. 

ఈ విధంగా రామనామాన్ని జపించిన ఎందరెందరో సంసారసాగరాన్నుండి ముక్తులైరి' అని నారదుడు సనత్కుమారునికి రామచరిత మహిమనుగూర్చి ఆదరంగా చెప్పి వీడ్కొని వెళ్ళెను. 

రామనామ మహిమనుగూర్చి ఎందరెందరో మహానుభావులు ఎన్నో విధాలుగా కీర్తించి వేనోళ్ళ మననంచేసి ధన్యులైనారు. 

అనేక పురాణాల్లో అనేక విధములుగా మానసోల్లాసం గలిగించే రామచరిత్రనుగూర్చి ఈ విధంగా నున్నది.

# నామ మహిమార్ణవము

శ్లో॥ సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమకారకాః
ఏకఏవ పరోమంత్రః రామఇత్యక్షరద్వయమ్ ॥

ఏడుకోట్ల మహామంత్రములు గలవు. అవి అన్నియు మనస్సున నిలకడలేక చలించునవియే! మంత్రములన్నింటిలోకి ఒక్కటియే మహామంత్రము కలదు. అది ఏదనగా 'రామ' అనే మధురమైన రెండక్షరాలలో ఉన్నదే! అదే రామతారక మహామంత్రము. మనస్సునందు రాముని

మూర్తిని నిలిపి మననముచేసిన రక్షించునది. గాన మంత్ర మను పేరువచ్చినది. మహామంత్రమనగా మంత్రము లన్నిటి లోకి మకుటాయమానమైన అతిశ్రేష్ఠమైనది. కాబట్టి రామ మంత్రమున కొక్కదానికే మహామంత్రమనే పేరువచ్చినది. ఇంతింతనరాని మహిమ కలదికాబట్టి దేవతలందరూకాక, దేవతలలో శ్రేష్ఠుడైన శ్రీమహాదేవుడే రామనామ మంత్ర మహిమనుగూర్చి కొనియాడుతూ, భక్తితో నిరంతరం పఠిం చుచున్నాడు. శివుడు మంత్రాన్ని మననం చేయుటమేకాక రామానుగ్రహం కొఱకు అత్యంత కఠోరమైన దీక్షతో నిష్ఠాగరిష్ఠుడై రామునియందు నిశ్చలమైన దృష్టినిలిపి జప, హోమ, పూజాదులచే వేయి మన్వంతరములు రామ మహా మంత్రాన్ని జపించెను. పరమశివునియొక్క పరమాద్భుత మైన భక్తికి మెచ్చి భగవంతుడు శ్రీరాముడు ప్రసన్నుడై పరమశివుని దగ్గరకువచ్చి "ఓ పరమేశ్వరా ! నీవు ఏకోరికతో ఇంతటి కఠోరమైన దీక్షతో తపస్సుచేశావు. నీ అభీష్టాన్ని నెరవేర్చుటకే నేను వచ్చినాను. కాబట్టి నీ కోరిక చెప్ప వలసిం"దని జగన్మోహనాకారుడైన శ్రీరాముడు మిగుల ఆదరంగా పరమశివుని అడుగగా పరమశివుడు గొప్ప ఆనందంతో రామమూర్తిని చూచి అంజలిబద్ధుడై అనేక విధములుగా కీర్తించి

శ్లో॥ అథ సచ్చిదానందాత్మానం శ్రీరామమీశ్వరః ప్రపచ్ఛ
మణికర్ణ్యాం మమక్షేత్రే గంగాయాం వాతటే పునః
మ్రియతే దేహీ తజ్జంతో ర్ముక్తింనాతో వరాంతరమ్।

సచ్చిదానంద స్వరూపుడవైన శ్రీరామచంద్రా! మహిమాన్వితమైన నీ శక్తిని ఎంతని పొగడగలను! రామ మహామంత్రాన్ని ఎంతని జపించినా నాకు సంతృప్తి కలుగుట లేదు. మంత్రజపాన్ని చేస్తే నాకు మాత్రమే ఆనందలబ్ధి కలుగుతున్నది. అలాకాక నావలన తక్కిన జీవకోటికి మేలు చేకూర్చే శక్తిని నాకు కలుగజేయవలసింది. నా నివాసమైన కాశీలో మణికర్ణికయందుగాని, గంగాతీరమందుగాని, కాశీ పట్టణంలో ఎచ్చటైననుగానీ మానవులుగాని, జంతువులుగాని మరణించినయెడల ఆ జీవి ఎంతటి పాపిఅయినప్పటికి నా క్షేత్రమందు మరణించుటచే ముక్తినొందచేసే మహిమను నాకిమ్ము" అని మహాదేవుడు అడుగగా అప్పుడు శ్రీరాముడు చిరునవ్వుతో ఇట్లనెను.

"ఓ దేవేశా! నీకోరిక చాలగొప్పది. నాకు చాల సంతోషము కలిగినది. నీఅంతటివాడు పాపజీవులపట్ల ఇంతటి జాలిని వారిని పాప పంకిలాన్నుండి బైటపడవేయవలెనని మహోన్నతమైన ఇచ్ఛను కలిగినందులకు నేనెంతో ఆనందిం చుచున్నాను. ఓ పరమేశా! నీ కాశీపట్టణమందున ఏ ప్రదే శంలోగాని, ఏ జీవిగాని మరణించిని వెంటనే వారి పాప సంచితాలతో నిమిత్తంలేకుండా ముక్తిని పొందగలిగే వరాన్ని ఇస్తున్నాను. మృతినొందబోయే జీవియొక్క కుడికర్ణమందు నీవు నా మంత్రాన్ని ఉపదేశించినట్లయితే ఆ జీవి మరల ఈ

సంసారబంధాలలో పడకుండ ముక్తిని పొంది నన్ను జేరును. ఇంతటి మహోన్నతమైన క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి నీవంటి వారికి కాక ఎవ్వరికి కలుగును? నీకీ మహదాశయమే కలుగుట ఆ జీవులు చేసికొన్న గొప్ప పుణ్యమే కానోపును. కాబట్టి ఓ పరమశివా! నేను ఎంతో ఆనందంగా నిన్ను అభినందిస్తున్నాను. అని శ్రీరాముడు పరమేశ్వరునకు వరంబొసంగి వైకుంఠమున కరిగెను.

అప్పటినుండి పరమశివుడు భవాని సమేతంగా రామనామ మహామంత్రాన్ని నిరంతరం జపిస్తూ, ఒక్క నిముసమేని ఏమరకుండ కాశీలో మృతినొందే జీవులకు తారక మహామంత్రాన్ని ఉపదేశించి ముక్తిని కలుగజేయుటకొఱకు రాత్రింబవళ్ళు కాశీలో సంచరిస్తూనే యుంటాడు. ఈనాటికిని పరమేశ్వరుడు భవానితోగూడి కాశీలో మరణించినవారికి రామతారక మహామంత్రాన్ని ఉపదేశించి పరమపదాన్ని కల్గిస్తాడని జనశ్రుతిగా చెప్పుకుంటారు.

కాబట్టే పరమ పవిత్రమైన కాశీలో మరణించాలని ప్రతివారు కోరుకుంటారు. కాని ఎవరో పుణ్యాత్ములకే లభించే అదృష్టం అది.

శివుడే కాదు, శివకుటుంబములోని వారందరూ 'రామ' నామాన్ని జపించి ఆశయసిద్ధిని పొందినట్టివారే. శివకుమారుడైన గణపతి రామనామాన్ని ఆశ్రయించే ప్రథమ పూజ్యుడయ్యెను

ఒకనాడు దేవసభలో దేవగణాలకు అధిపతిలేక ఎవరి ఇచ్చివచ్చినట్లు వారు సంచరిస్తున్నారు. వారికి సమర్థుడైన ఒక నాయకుడు ఉండినట్లయితే దేవకార్యాలు సుగమంగా నెరవేరుతవి అని దేవగణాలకు ఒక నాయకుడు కావలెను. కాని ఆ నాయకుడెవరు ? అనే ప్రశ్న ఉదయించగా ముల్లోకాలకు అధిపతియైన ముక్కంటి కుమారునికే ఆధిపత్యం ఇవ్వటం బాగుంటుందన్నారు. కాని శివుని కుమారుల్లో ఎవరికి ఆ పదవి ఇవ్వాలన్న ప్రశ్నకు అనేకమైన భేదాభిప్రాయాలు రాగా చివరకు ఎవరైతే ముల్లోకాలు ప్రదక్షిణంచేసి సకల జీవనదులలో స్నానంచేసి సకల పుణ్యక్షేత్రాలను దర్శించి వస్తారో వారి కీఆధిపత్యం ఇవ్వాలి" అని ఏకగ్రీవంగా నిర్ణయించి శివకుమారు లిద్దరిని పిలిచి ఆ విషయం చెప్పగా కుమారస్వామి నెమిలి వాహానంఎక్కి మహోత్సాహంతో ముల్లోకాలూ చుట్టిరావడనికి వెళ్ళగా లంబోదరుడు చింతాక్రాంతుడై రజతశిఖర వనాంతరంలో చెక్కిట చేయిజేర్చి కూర్చున్నాడు.

లోకసంచారి యగు నారదుడు అటుగా వెడుతూ లంబోదరుణ్ణి చూచి దగ్గరగావచ్చి "ఏమోయ్ ! గజాననా! ఇల్లా ఇక్కడున్నా వేమిటి ? ఏదోపెద్ద ఆపద వచ్చినట్లుగా నున్నది నీ మొహం చూస్తుంటే; మళ్ళీ ఏరాక్షసునితోనైనా యుద్ధం వచ్చిందా ? నీకున్న ఆ ఒక్కదంతాన్ని పోగొట్టుకోవాలన్న చింతతోఉన్నట్లు కనిపిస్తోంది" అనగా గజముఖుడు

విషయాన్నంతా వివరించి, ఓ నారదా! ఇది ఏమన్నా ధర్మంగా ఉన్నదా? ఈ లంబోదరంతో, చిట్టెలుకమీద నెక్కి నే నేలాగ లోకాలన్నీ చుట్టిరాగలను? చూడగా దేవతలందరికి నాతమ్ముని పట్లనే పక్షపాతం కలిగి, అతని నే అధిపతిగా చేయవలెనని వారు పన్నిన కుట్రగానున్నది. లేకపోతె పెద్దకుమారుడనైన నాకే అధిపతి కాదగిన అర్హత ఉన్నదిగదా! నన్ను ఓడించి చిన్నపుచ్చటానికి కాకపోతే ఏమిటిదంతా” అని దీనంగా నారదునితో అనగా నారదుడు పకపకానవ్వి “ఓ గజాననా! ఇంతచిన్న విషయానికి ఇంత విచారమేమిటోయ్! ఎంతో తెలివిగలదిగా పేరెన్నికగన్న నీ గజమస్తకంలో యీ స్వల్పమైన దానికి మార్గమే తోచ లేదా? నే నోచిన్న ఉపాయం చెప్తాను. దాన్ని ఆచరించి నట్లయితే నీవే అధిపతివి కాగలవు” అని గజాననునకు తారక మంత్రాన్ని ఉపదేశించి, భక్తిశ్రద్ధలతో దీనిని జపించి 'రామ' అన్న పవిత్రమైన రెండక్షరాలు నేలమీద వ్రాసి, దానిచుట్టు ప్రదక్షిణం చేసితివా! ముల్లోకాలేమిటి, ముక్కోటిలోకాలు ప్రదక్షిణం చేసినంత మహాఫలం కలుగుతుంది. ఇంతకన్నా మహాఫలాన్ని ఇచ్చే మహామంత్రం ఇంకేదీ లేదు. శుచివై ఈమంత్రాన్ని పఠించి నీకోరిక నెరవేర్చుకో” అని చెప్పెను నారదుడు.

అంతట గజాననుడు అత్యంత భక్తితో 'రామ' మంత్రాన్ని జపించి 'రామ' అన్న అక్షరాలచుట్టు ప్రద

క్షిణంచేసి తల్లిదండ్రులవద్దకు వెళ్ళగా త్రిభువనాలు ప్రద
క్షిణంచేసి సకల జీవనదులలో గ్రుంకులిడి సకలపుణ్య క్షేత్ర
ములు దర్శించితే కలిగే పుణ్యంకన్నా ఎన్నోరెట్లు పుణ్యం
పొందిన మహాతేజస్సుతో వెలిగిపోయె కుమారుని ముఖం
చూచి ఆశ్చర్యంతో 'కుమారా! గజాననా! అప్పుడే
ముల్లోకాలు ప్రదక్షిణం చేసేవా, నీ తమ్మునికంటె ముందుగ
ఎల్లా రాగలిగావు?' అని శంకరుడు అడుగగా తండ్రికి
అత్యంతభక్తితో నమస్కరించి నారదముని సలహానసరించి
తా నాచరించిన మంత్రానుష్ఠానాన్ని గురించి గజాననుడు
చెప్పగా పరమేశ్వరుడు ఆశ్చర్యంతో కుమారుణ్ణి కౌగలిం
చుకొని "నాయనా రామమహామంత్రాన్ని జపించి నీవు
ధన్యుడవయ్యావు. ఇంతకన్నా పుణ్యం మరేదిలేదు. ఎన్ని
లోకాలు తిరిగినా, ఏ దేవతల్ని పూజించినా లభించని
గొప్ప పుణ్యసంపద 'రామ' మంత్రానుష్ఠానమువలన కలుగు
తుంది. అది నీకు కలిగింది. కాబట్టి దేవగణాధిపత్యానికి నీవే
అర్హుడవు" అని దేవతలందరికి గజానను డనుసరించిన
మంత్రానుష్టానాన్ని చెప్పి అతనికే ఆధిపత్యాన్నిచ్చి గణపతి
అన్న పేరుతో గణపాలనచేస్తూ ప్రథమ దేవునిగా పూజ
లందుకోవలసినదిగా కోరారు. నాటినుండి గజాననుడు గణ
పతిగా ప్రథమపూజ నందుకొంటూ తనని కొల్చిపూజించే
వారికామితార్థాలు తీరుస్తూ గణనాయకత్వం వహించాడు.

దీనికంతటికీ కారణం రామ మంత్రానుష్ఠానమే! ఒక చిన్న మఱ్ఱిగింజలో మహోన్నతము, అత్యంత విశాలమైన వృక్షరాజం ఎల్లా ఇమిడిఉన్నదో అల్లాగే 'రామ' అన్న రెండు బీజాంకురములలోను ఈ చరాచర జగత్తుఅంతా ఇమిడి ఉన్నది. ఇది చాలా సులభమైన మార్గము; కలియుగంలో భగవన్నామస్మరణ వలననే దేవతాదర్శనము, ముక్తి కలుగుతుంది. ఇంతకన్నా మరో మార్గంలేనే లేదు. సాక్షాత్తు శ్రీరామచంద్రుడే హనుమంతునికి ఈ విధముగా ఉపదేశించెను.

"ఓ కపీ! హనుమంతా! ఎటువంటి దురాచారుడైనను నానామ భజన మొనర్చినచో ఆతడు నా లోకముచేరి నన్ను పొందును. ఇంకొక లోకమునకు బోడు" [రామ రహస్యోపనిషత్]

శ్లో॥ యోఽమమమంత్రం జపనితస్యశుభీకరోఽహంస్యామ్.

"రామమంత్రము నెవడు జపించునో - నేను వానికి సర్వదా శుభాన్ని కలుగజేసి వాని మంచిచెడ్డలు, సుఖదుఃఖాలన్నియు నావిగనే భావించి వాటిని నేనే అనుభవించి అతనికి సుఖాన్ని కలుగజేయుదును. కాబట్టి ఓ హనుమా! రామమంత్ర రహస్యాన్ని బాగుగా నెరిగి జపించినవారికి నేను ఋణపడియుండెదను" అనగా హనుమంతుడు ముప్పిరిగొన్న భక్తిపారవశ్యంతో కనులనీరు నిండగా శ్రీరామునకు చేతులు ముకుళించి

హనుమత్సంహిత -

శ్లో॥ రామ త్వత్తోఽధికం నామఇతిమే నిశ్చలామతిః
త్వయాతు తారితాఽ యోధ్యానామ్నాస్తు భువన
త్రయమ్ ।

ఓ రామా! నీవు చెప్పినది ఎంతయో బాగుగానున్నది. నీకంటే నీనామమే గొప్పదని నాదృఢనిశ్చయము. ఎందువల్లననగా నీవు కేవలము అయోధ్యావాసులను మాత్రమే తరింపచేసినావు. నీనామమో ! అనంతమై, మహిమాన్వితమై త్రిలోకములందు పవిత్రమైన గంగానదివలె లోకత్రయముల వ్యాపించి నీ నామాన్ని జపించేవారి హృదయాన్ని అమృతమయంచేసి పరమపదాన్ని కలుగజేస్తుంది. కాబట్టి ఓరామా! నీ నామమే సర్వావస్థలయందు నా జిహ్వాగ్రాన నిలిచి పరమపావనమైన నీ మంగళరూపాన్ని నా హృదయమందు నిలిపి చేతనాచేతమైన ఈ సకల చరాచర జగత్తు నీ రూపంగానే నాకు గోచరించేటట్లు అనుగ్రహించవలసిందిగా వేడుకొనుచున్నాను" అనెను.

అతని మాటలకు శ్రీరాముడు అత్యంతాభిమానంతో మారుతిని కౌగలించుకొని "ఓ హనుమా! నిశ్చలమైన నీ భక్తికి నేను ఎంతో సంతోషించితిని. నా నామమే నీ హృదయమంతా నిండి నిన్ను మహిమాన్వితుణ్ణి, మహాశక్తిమంతుణ్ణి చేస్తుంది. ఈ భువనాలు ఉన్నంతవరకు నీవు చిరంజీవివై ఎల్లెడలా సంచరిస్తూ, నా నామాన్ని జపించేవారికి

సకలకళ్యాణకరమైన శుభాన్ని కలుగజేస్తూ, నా నామస్మరణ ఎక్కడెక్కడ జరుగునో అక్కడల్లా భూత ప్రేత పిశాచ పాప భయాలు లేకుండా కాపాడవలసింది" అని హనుమంతుణ్ణి అత్యంత ఆదరంతో ఆశీర్వదించాడు శ్రీరామచంద్రమూర్తి.

ముక్తికోపనిషత్ –

శ్లో॥ శ్రీరామనామం నిరతం నిరంతం పరికీర్తనీయం
వర్తేత మోద, సునిధా న మశేషసారమ్ ॥
జన్మార్జితాని వివిధా న్యసహాయ దుఃఖా
న్యత్యంత ధర్మనిచయం పరధామ చేతి ॥

శ్రీరామనామము నిరంతరము పరమసంకీర్తనమైనది. ఆనంద సముద్రములన్నిటికి సారమైనది. ఇది అనేక జన్మల నుండి చేసిన పాపములను, దుఃఖాలను సమూలముగా నిర్మూలించి పరమపవిత్రులను చేయుటయేగాక నిత్యము, సత్యము, అతి దుర్లభము అయిన పరమపదధామాన్ని చేర్చును.

వాచ్యుడు శ్రీరామచంద్రుడు. వాచకము రామ నామము. కాబట్టి ఈవాచ్యవాచక భావసంబంధము నిత్యము. మహిమాన్వితమైనది, శ్రీరామనామ మహా మంత్రము సర్వులు సర్వత్రా చేయవచ్చును. దానికీర్తన మొనర్చుటకు బాహ్యమైన పవిత్రత అక్కఱలేదు. ఎందుచేతననగా, అది స్వయముగా పరమపవిత్రమైనదియేగాక తాను సంచరించే సర్వప్రదేశాలను పవిత్రవంతం చేయగల అమోఘమైన శక్తి గలట్టిది. రామనామము ఒక్కసారి హృదయంలో ప్రవేసిస్తే

అది మూల మూలల శోధించి, దుష్టస్వభావమనే మలినాల్ని వెలుపలకు పారద్రోలి, స్వచ్ఛము, పవిత్రము అయిన గంగా సలిలమువలె మనస్సును, హృదయమును ప్రక్షాళనముచేసి పవిత్రవంతం చేస్తుంది. కాబట్టి ఏ వేళగాని, ఏ నిమిషమందుగాని, ఏ స్థితియందుగాని, శుచిగాగాని, అశుచిగాగాని, ఇష్టమయిగాని, అయిష్టంతోగాని రామనామాన్ని పఠించినట్లయిన సమస్త ఫలములను ఇచ్చి మోక్షమునుకూడ ప్రసాదించును. ఇందువలన తెలియునదేమన, 'నేను రామనామాన్ని జపించవచ్చునా? నేను పాపాత్ముణ్ణే, నా అంతర్యం పవిత్రంగా లేదే. ఇంత గొప్ప మహామంత్రాన్ని మననంచేయటానికి నాకు అర్హత లేదే!' అని ఎవ్వరుగాని విచారపడి సందేహించనక్కఱలేదు. ఒక్కమారు నోరారా 'రామా' అనినచాలు, వారి సర్వపాపములు హరించి పోతాయి. ఇంత పవిత్రత, మహాశక్తివంతమైన రామనామ సంకీర్తన చేయటానికి సందేహమేల? ముల్లోకములందు అత్యంత సుందరము, మధురము, మోహనము, మోక్షదాయకము అయిన నామము మరెక్కడను లేదు. నిరంతరం 'శ్రీరామా! రామభద్రా! సీతారామా! భరతాగ్రజా! దాశరథీ!' అని అత్యంత భక్తితో జపించేవారు ధన్యాతిధన్యులు. అటువంటి భక్తవరేణ్యుల పాదరేణువులు శిరస్సున దాల్చినవారు గూడ పుణ్యాత్ములే.

శ్లో॥ కలౌయుగే రాఘవనామ తస్సదా
పరంపదం యాత్యన యా గతోధ్రువమ్
సర్వైర్మునీన్ద్రైః పూజిత మున్నతం యుగం
సమస్త కల్యాణనికేతనం వరమ్.

కలియుగము అన్ని యుగములకంటె నిశ్చయముగా అతి శ్రేష్ఠమైనది. ఎందుకనగా రాఘవనామముచేతనే ముక్తి లభించును. యజ్ఞయాగాదులు అక్కరలేదు. కఠోరమైన నియమాలు అక్కరలేదు. కేవలము 'రామా, రామా' అని జపించినంత మాత్రమునే శ్రీరాముడు సంతోషాంతరంగుడై, వారికి సకల శుభాలు కలిగించును.

రామపాదసేవకుడు వాయుపుత్రుడు "ఎవ్వరైతే రామనామాన్ని జపింతురో, ఎవ్వరైతే జానకీజానిని హృదయాన నిలిపి పూజింతురో! అలాంటివారికి సకలసంపదలనిచ్చి అత్యంత జాగరూకతతో వారిని కాపాడుటకొరకే కలియుగములో ఎల్లెడలా సంచరిస్తూ ఉంటాడు. ఇంతటి పుణ్యప్రదమైన అవకాశం, సులభతరమైన మార్గమూ కలియుగంలో మానవులకే లభించింది. ఏ యుగంలోనివారికి ఇట్టిది లేదు. కనుకనే కలియుగం అన్నియుగాలకంటె శ్రేష్ఠమైనది.

యముడు యమదూతలతో నిట్లనెను "ఓ భటులారా! నేను చెప్పబోయెడిది శ్రద్ధగా వినండి. సుస్థిరము, శుభకరము, మంగళప్రదము, మహనీయపుణ్యవంతము

అయిన 'రామనామము' నెవ్వరు స్మరింతురో! వారిదగ్గరకు మీరు పోవద్దు.

శ్లో॥ సాంకేతరీత్యా దభయేన క్లేశా
దంతేఽపి శ్రీరామ ముదాహరంతి
తే పుణ్యభాజో మమయేమహాత్మకా
నతత్ర యాత్రా భవతాం శుభావహా॥

భయముచేతనైనను, బాధతోగాని, ఇష్టమైగాని, ఇష్టముగాకున్నగాని ఎవరైతే అత్యంకాలమున శ్రీరామనామమును పలుకుదురో అట్టి పుణ్యాత్ముల ఛాయలకుగూడ మీరు పోవద్దు వారిని శ్రీరామునికడకు తీసికొనివెళ్ళుటకు వాయుపుత్రుడు వచ్చును. మీరు అచ్చటకు పోయెదరేని మారుతి మహాకోపియై తనవాలముచేత మిమ్ము చుట్టివేసి బాధించును, కాబట్టి ఓ దూతలారా! శ్రీరామనామ సంపన్నులగువారి ఇండ్లకు మీరు బోవద్దు. దూర దూరంగా తొలగిపోవలసినది. ఏ నామ ప్రభావముచేత బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి స్థితి లయము లొనర్చుచున్నారో అట్టి మహా శక్తివంతము, మహాపుణ్యప్రదము అయిన భగవన్నామము పలికేవారు మనకు అత్యంత ఆప్తులు, పరమపూజనీయులు. వారికి మనం సదా చరణసేవకులము" అని యముడనెను.

హనుమంతుడు ఎల్లప్పుడు తనకు తాను ఈ విధంగా హెచ్చరిక చేసుకొనును.

శ్లో॥ హేజిహ్వే! జానకీజానేర్నామ మాధుర్యమండితమ్
భజస్వ సతతం ప్రేమాచే ద్వాచాంవాంఛసి స్వకమ్ ॥

ఓ నాలుకా! నీవు జ్ఞానము కోరుకొనునెడల ప్రేమతో నిరంతరము మధురమగు జానకీపతియగు శ్రీరామచంద్రుని నామమును భజింపుము;

శ్లో॥ జిహ్వే! శ్రీరామసంలాపే విలంబంకురుషే కథమ్
వ్రీడా నాయాతితే కించిద్వినా శ్రీరామ సుందరమ్ ॥

"ఓ నాలుకా! శ్రీరామనామమును కీర్తించుటకు కాలసించెద వేల? భగవన్నామమునుగాక వేరొక దానిని బలుకుటకు నీకు సిగ్గువేయుటలేదా?" అని సర్వదా తనను తాను హెచ్చరిక చేసుకుంటూ అత్యంత మధురమైన రామ నామామృతాన్ని అత్యంత ప్రీతితో గ్రోలి హృదయాన్ని మధురవంతం చేసికొనుచు జానకీ రామచంద్రుల మంగళ కరమైన రూపాన్ని కనులముందు సాక్షాత్కరింప చేసికొనుచు రామ చరణారవిందాల్ని నిరంతరం ధ్యానించుచు రామనామమే ఆహారం, రామనామమే పానీయం, రామ నామమే జీవనం రామభక్తులకు శుభాన్ని కలిగించుటయే జీవన ధ్యేయంగా భావించి, నిరంతరం రామనామ ధ్యాన నిమగ్నుడగు మహాభక్తుడు వాయుపుత్రునికన్నా మించిన భక్తులు ఈ త్రిభువనాలు వెతికినా కానరారు.

వాయుపుత్రుడు ఒకానొక మునితో ఈ విధంగా జెప్పెను.

"ఓ మునీ! శ్రీరామనామ స్మరణముచే సీతారాములు నాపై సహేతుక ప్రేమ జూపుచున్నారు. రామనామము పరాకృతమైనదని నేను సత్యముగను చెప్పుచున్నాను. రామనామ మహిమ ఇంతటిదని కొనియాడ బ్రహ్మాతరంకూడ కాదు. ఇక నే నెంతటివాడను? కాని ఒక్క సత్యమును చెప్పుచున్నాను వినుము రామనామాన్ని ధ్యానంచేసేవాడు శ్రీరామునకు అత్యంత ప్రీతిపాత్రుడు అగును. వానియొక్క జీవితభారం తానే వహించును. దీనికి ఎంతమాత్రము సందేహంలేదు.

శ్లో॥ శ్రీరామనామ సామర్థ్యాదక్షిలేష్టం కరేస్థితమ్
భలాద్ధి కృతపుణ్యానాం యథాకల్పతరోర్ధనమ్ ॥

కల్పతరువు వలన ధనమెట్లు ప్రాప్తించునో అట్లే శ్రీరామనామ ప్రభావముచే నెల్లకోరికలు తీరి జన్మాంతరమున శ్రీరామ చరణాలలో లీనమగుదురు. ఎంత పాపాత్మునినైన రామనామం ఆతని పాపాలన్నిటిని దహించి పవిత్రవంతునిగా చేయును. ఇది ముమ్మాటికిని సత్యము. అంతియేకాదు క్రిందటి జన్మలో చేసినట్టి పాపము, ఇప్పుడు చేసిన పాపము, ముందు జన్మలో చేయబోవు పాపము 'రామ' యని ఒక్కసారి జపించుటచే ఆ పాపములన్నియు నామరూపాలు లేకుండపోయి విశుద్ధాత్ముడగును. ఓ మునీ! ఇంతింతనరాని మహిమగలిగి రామనామాన్ని గూర్చి ఎంత చెప్పినా అల్పమేననిపిస్తుంది. రామనామాన్ని భక్తితో

ధ్యానించినవారికే ఆ ఆనందము అనుభవైకవేద్యం. సర్వ మానవులు తారతమ్య భేదాలులేకుండగ రామనామాన్ని ధ్యానించి ముక్తులు కావాలని నా కోరిక; అందువలననే నెక్కడ రామనామం కీర్తింపబడుతున్నదో అక్కడే నా నివాసము; వారికే ఎల్లప్పుడు నేను సహాయకారిగా ఉంటాను.

పాండవగీతి –

శ్లో॥ సత్యం బ్రవీమిమనుజాః స్వయమూర్ధ్వబాహు
పిర్యోమాం ముకుంద, నరసింహ జనార్దనేతి
జీవోజపత్యనుదినం మరణే రణేవా
పాషాణకాష్ఠ సదృశాయదదామ్యభీష్టమ్ ॥

ఓ మానవులారా! నేను సత్యమునే చెప్పుచున్నాను. ఏ జీవి తన మరణసమయమునగాని, రణరంగమందుగాని, ముకుందా, నరసింహా అను నిత్యాది నామములతో నన్ను స్మరించునో అట్టివాడు మోటమొద్దు, మొండిబండవలె నెంతటి జడుడైనను, వాని అభీష్టములనుదీర్చి పాప పరహారము గావించి నిత్యము, సత్యము అయిన పరమపదవి నొసంగుచున్నాను. ఎవ్వరైనాగాని, నన్ను మనసా వాచా స్మరించదరేని అట్టివారు ఇహమందు సుఖము, పరమందు పుణ్య లోకము బొందెదరు.

శ్లో॥ కృష్ణేతి మంగళం నామయస్యవాచి ప్రవర్తతే
భస్మీభవంతి తస్యాశు మహాపాతక కోటయః.

'కృష్ణా' యను మంగళమగు నామ మెవ్వని జిహ్వా యందు వర్తించునో వాడు చేసిన మహాపాపములు కోట్లకొలది యున్నను ఒక్కసారిగ భస్మమైపోవుచున్నవి.

ఉమాసంహితలో –

శ్లో॥ కోటితీర్థాని దానాని కోటియోగ వ్రతానిచ
కోటియజ్ఞ జపాశ్చైవ తపసః కోటికోటయః
కోటిజ్ఞానైశ్చ విజ్ఞానైః కోటిజ్ఞాన సమాధిభిః
సత్యం వదామి తుల్యాని రామనామ్నాన తాన్యమే!

శంకరుడు పార్వతీదేవితో ఇట్లు చెప్పెను – "ఓ పార్వతీ! నేను నా హృదయమందు నమ్మిన సత్యమునే చెప్పుచున్నాను. కోటితీర్థములు సేవించినను, కోటిదానములు చేసినను, కోటియాగములు లొనర్చినను, కోటివ్రతము లాచరించినను, కోటితపస్సులు చేసినను ఏవియును రామనామమునకు సరికావు. అంతటి గొప్ప పుణ్యములుకూడ రామనామము ముందు అల్పముగా నగును. పాపములనే విషకీటకములు రామనామమనే మహాజ్యోతిలోపడి క్షణంలోనే భస్మమైపోవును. ఓ పార్వతీ! రామమంత్ర మహాత్మ్యాన్ని చెప్పుటకు ఆదిశేషునకున్న వేయి నాల్కలుకూడ చాలవు. అది ఎంతటి మహావేగంతో మహాపాపపాషాణాల్ని ఎగరగొట్టివేయునో! గరుత్మంతుని వేగంకూడ రామనామ మహా ప్రభంజనానికి సరిరాదు. కాబట్టి నా నాలుకయందు

సర్వకాలసర్వావస్థలయందు రామనామమే నాట్యము చేయాలని కోరుకుంటాను. కాబట్టి పార్వతీ! నీవుకూడ నిశ్చలమతివై భక్తి శ్రద్ధలతో రామనామాన్ని జపించి ధన్యురాలవు కమ్ము.

తులసీదాస రామచరిత మానసము –

శ్లో॥ బ్రహ్మాంభోధిసముద్భవం కలిమలప్రధ్వంసనం చావ్యయం
శ్రీమచ్ఛంభుముఖేందు సుందర వరే సంశోభితం సర్వదా
సంసారామయ భేషజం సుమధురం శ్రీజానకీ జీవనం
ధన్యాస్తే కృతినః పిబంతి సతతం శ్రీరామనామామృతం ॥

వేదములనెడు సముద్రమునందు పుట్టినదియును, కలియుగ సంబంధ దోషములను నాశనము చేయునదియును, నశింపనిదియును, శ్రీసదాశివుని ముఖేందు మండలమున సర్వదా శోభించునదియు, సంసారమను రోగమునకు పరమౌషధమును, అతి మధురమైనదియు, జానకీదేవికి జీవనమైనదియును నగు శ్రీరామనామామృత రసాయనమును పానము చేయు పుణ్యాత్ములు ధన్యులు.

వారి మహాభాగ్యము ఏమని చెప్పవచ్చును! కఠోరమైన నియమ, నిగ్రహాలు ఏమియు లేకుండ అతిసులభముగ మనస్సునందు రాముని మంగళ రూపాన్ని నిలిపి 'రామా' యని ఒకసారి జపించినచాలు, అట్టివారు ఎంతటి కుటిలులు దురాచారపరులైనప్పటికి దయాసముద్రుడగు శ్రీరాముడు వారి తప్పిదములన్నిటిని క్షమించి పరమపుణ్యవంతుల్ని

చేయును. కాబట్టి పామరులారా! ఇష్టమయిగాని కష్టమందుగాని శ్రీరాముని మనస్సునందు నిలిపి రామనామాన్ని జపించినట్లయిన మీా భారమంతటినీ శ్రీరాముడే స్వీకరించును, శ్రీరాముని దయకు పాత్రులైనవారి పుణ్యమే పుణ్యము.

బ్రహ్మరామాయణము –

శ్లో॥ జ్ఞానం సీతారామ తుల్యం నకించిత్
ధ్యానం సీతా నామ తుల్యం నకించిత్
భక్తిః సీతానామ తుల్యం నకించిత్
తత్వం సీతానామ తుల్యం న కించిత్.

ఏ జ్ఞానమును, ఏ భక్తియును, ఏ ధ్యానమును, ఏ తత్వమును సీతానామమునకు సాటిరాదు. సీతానామమును ఎవ్వరు స్మరింతురో అట్టివారి పట్ల సంతోషాంతరంగుడైన శ్రీరామచంద్రుడు, వాయుపుత్రుని పట్ల చూపిన వాత్సల్యమే చూపును. ఈ త్రిభువనాలు వెతికినా, అంతకన్నా అదృష్టమేమియున్నది ?

శ్లో॥ సీతేతి మంగళం నామ సకృచ్ఛ్రుత్వా కృపాకరః
శ్రీరామో జానకీ జాని ర్విశేషణ ప్రసీదతి.

కృపాకరుడగు జానకీపతియగు శ్రీరాముడు సీతయను మంగళకరమగు నామము విన్నంతనే విశేషముగా ప్రసన్నుడై అట్టివారిని తనకు అత్యంతప్రియమైన వారిగా భావిం

చును. శ్రీరామచంద్రుని దయకు పాత్రులు కావలెనన్న అత్యంత భక్తితో సీతానామాన్నే జపించవలెను. అంతకంటె మనోహరమైనదియు, శ్రీరామునకు ప్రియమైనదియు వేరే దియు లేదు.

ప్రమోద రామాయణము –

శ్లో॥ రామనామ్నాం శతో జాత–సంస్మరంతశ్చ సంకులాః
అబుధా నైవ జానంతి నామ మహాత్మ్య ముజ్జ్వలమ్ ॥

శ్రీరామనామముయొక్క అంశము చేతనే అనంతము లగు మంత్రము లుత్పన్నమగుచున్నవి. కాని మూఢులు ఉజ్జ్వలమైన రామనామ మహాత్మ్యము నెరుగరు. అన్ని మంత్రములకు రామ మంత్రమే మూలమైనప్పుడు రామ మంత్రాన్ని వదలి మిగిలిన మంత్రాలు ఉపాసించటం,గంగా నదిని వదిలి దానియందు పుట్టిన పిల్లకాలువల్లో మునిగినట్లే యగును.

వశిష్ఠ రామాయణము –

శ్లో॥ మన్నామోచ్చారకం సాధుం సాదరం పూజయంతి యే
తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్ ॥

శ్రీరాముడిట్లనెను– ఓ కపీశ్వరులార ! నా నామో చ్చారణ చేసినట్టి భక్తులను ఎవరు ఆదరించి పూజించెదరో ! అట్టి వారినికూడ సంసార సాగరాన్నుండి విముక్తులను చేసె దను. స్వయంగా నా నామమును జపించినట్లయిన ఎంత

పుణ్యము గలుగునో, నా భక్తులను పూజించినా అంతకన్న మిక్కుటమైన ఫలమే ఇచ్చెదను. ఏలననగా నన్ను పూజించే వారి దాసుడను నేను. కాబట్టి నిత్యము నన్ను సేవించే వారికి నే నెంతయో ఋణపడియుండి వారి అభిష్టములను తీర్చెదను. కాబట్టి కపీశ్వరులార! స్వయముగా నా నామము జపించలేక పోయినప్పటికి, నా భక్తులను శరణు వేడుడు. వారివలన మీకు ముక్తి కలుగును.

శ్లో॥ యేస్మరంతి సదాస్నేహాన్మమనామ సుధారసః
తేఽతిధన్యాః ప్రియాస్తేన సత్యం సత్యం బ్రవీమ్యహమ్

అమృత సముద్రమగు నా నామమును సదాప్రేమతో నెవరు స్మరించుచున్నారో! వారు ధన్యులు. వారు నాకు మిక్కిలి ప్రియులు. ఈ విషయము నేను సత్యముగా చెప్పు చున్నాను.

శ్లో॥ ఏతదేవ పరం తత్త్వం మత్ప్రసన్నాయ నిశ్చితమ్
మనసా వచసా నిత్యం భజేన్మన్నామ మంగళం॥

మనస్సుతోడను, వాక్కుతోడను, నిత్యమును మంగళ కరమగు నా నామమును నా ప్రసన్నతకొరకు భజించుటయే సునిశ్చితమగు పరమరహస్యము. ఇష్టముతోగాని, ఇష్టము లేకున్నగాని, నోటితో స్మరించినగాని, చెవులతో వినినగాని, అట్టివారికే ముక్తి లభించినప్పుడు మనసా, వాచా పరమ భక్తితో నన్ను సేవించేవారికి కలిగే పుణ్యమేమని చెప్పుదును!

భవసాగర బంధనాలనుండి విముక్తి పొందగోరువారు నిశ్చల మైన మనస్సుతో, వాక్కుతో, క్రియతో నన్ను పూజించి ధ్యానించవలెను. వారికి ముక్తి లభించునో లేదో అన్న సందియము వలదు. ఎప్పుడైతే శ్రీరామనామాన్ని నిష్ఠతో జపిం చుదురో! అప్పుడే వారికి స్వర్గమందు స్థానం లభించినట్లే! ఈ రహస్యము తెలిసినవారికి ఇక జనన మరణములు లేవు.

శ్లో॥ మన్నామ సంస్మరేద్యస్తు సతతం నిమరేంద్రియః
తస్మాత్ప్రియ తమః కశ్చిన్నాస్తి బ్రహ్మాండ మండలే ॥

ఎవరు నిరంతరము ఇంద్రియములను నిగ్రహించుకొని నా నామమును స్మరించుదురో వారికంటె నాకిష్టమైనవారు ఈ బ్రహ్మాండమందు ఎక్కడనులేరు.

శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో నిట్లనెను –

శ్లో॥ మత్కథా శ్రవణే పాఠే వ్యాఖ్యానే సర్వదా రతిః
మత్పూజా పరినిష్ఠా చ మమ నామానుకీర్తనమ్॥

నా ప్రియమైన తమ్ముడా! వినుము. నా కథనువి నుట యందును, పారాయణము చేయుటయందును, వ్యాఖ్యానిం చుటయందును సర్వదా ప్రీతికలిగియుండుటయు, నా పూజ యందు నిష్ఠకలిగియుండుటయు, నా నామకీర్తన మొనర్చు టయు ఇవన్నియు భక్తిసాధనములు. సాక్షాత్తు శంకరుడే ఈ విధమైన నిష్ఠతో తపస్సుచేసి నన్ను ప్రసన్నము చేసికొని తన అభీష్టము నెరవేర్చుకొనెను. ఇక వేరొకరి సంగతి చెప్పనేల ?

శ్లో॥ ఏతదాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణం నరః
సపుత్ర పౌత్ర స్వగణః ప్రేత్యస్వర్గే మహీయతే ॥

ఆయుర్వాసంగు నీ రామాయణము నెవ్వరు పఠించు దురో అట్టివారు పుత్ర పౌత్రాదులందరితో స్వర్గమున పూజింపబడుదురు. కాబట్టి రామాయణ పఠనము అత్యంత శక్తివంతమైన ఫలితాన్ని ఇచ్చునది.

లక్ష్మణుడు అంజలిబద్ధుడై శ్రీరామునితో నిట్లనెను - రామా! నీవు చెప్పినదే నిజము. అందరికి శిరోధార్యము.

శ్లో॥ అమోఘం దర్శనం రామ! అమోఘస్తవ సంస్తవః
అమోఘాస్తే భవిష్యంతి భక్తిమంతో నరాభువి ॥
యేత్వాం దేవం ధ్రువం భక్తాః పురాణ పురుషోత్తమమ్
ప్రాప్నువంతి తథాకామా నిహాలోకే పరత్ర చ ॥
ఇమమార్షస్తవం దివ్యమితిహాసం పురాతనమ్
యేనరాః కీర్తయిష్యంతి నాస్తితేషాం పరాభవః ॥

ఓ రామా! నీ దర్శనమును, స్తవముమ అమోఘమైనవి. భూమియందు దేమానవులు నీ భక్తిని చేయుదురో! వారి మనోరథములు నిష్ఫలములు కావు.

పురాణపురుషోత్తముడవు, నిశ్చల దేవుడవునగు నీ భక్తిని చేయువారీలోకమునందును, పరలోకమునందును తమ కోర్కెల బొందెదరు. ఏ మానవుడీ ప్రాచీనేతిహాసమును

దివ్యస్తోత్రమును గీర్తించునో! వారికెన్నడును పరాభవము కలుగదు.

శ్లో॥ జయాయ జయ భద్రాయ హర్యశ్వాయ నమోనమః
నమోనమః సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః
ఏవమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషుచ
కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ ॥

జయాయ! [నీవు బ్రహ్మలోకము వరకును జయమును బొందించువాడవు] జయుడు బ్రహ్మ ద్వారపాలకుడు నీవతని రూపమును ధరించినవాడవు, అట్టి నీకు నమస్కారము. జయభద్రుడనెడి బ్రహ్మయొక్క మరియొక ద్వారపాలక స్వరూపమును ధరించినవాడవు. కావున జయభద్రుడవగు నీకు నమస్కారము. హర్యశ్వాయ! నీవు పూర్వకల్పమందు రామ స్వరూపము ధరించి వానరశ్రేష్ఠుడగు హనుమంతుని నశ్వముగ చేసికొనిన నీకు నమస్కారము. వేలకొలది జీవులు నీయంశములు కావున సహస్రాంశుడవు. చరాచర జీవులందరును నిన్నాదిత్యుడని కీర్తించుచుందురు. అట్టి నీకు మాటిమాటికి నమస్కారము. ఓ రాఘవా! దుర్గమస్థానములందును భయమునందును, ఆపత్తులందును, దుఃఖములు సంభవించినప్పుడును మానవుడు ఆదిత్యహృదయమును గీర్తించిన కష్టములు పొందరు. ఆదిత్యరూపముకూడ నీ రూపమేగదా! నీవు ప్రథమ కల్పమందు ఆకాశ వర్ణాన్ని దాల్చి శ్రీమహావిష్ణుమూర్తివై సృష్టి స్థితి లయముల కొరకు బ్రహ్మ

విష్ణు మహేశ్వరులుగా త్రిమూర్తుల రూపాన్ని ధరించినావు. మరియొక కల్పమునందు వాయుతత్వాన్ని గ్రహించి నభో మండలమున మహాజ్యోతిర్మూర్తి అయిన సూర్యునిరూపాన్ని ధరించి స్వర్ణవర్ణముతో జీవులకు ప్రాణాధారమైనావు. త్రిమూర్తులనుండి ఉద్భవించినట్టిదియే సూర్యరూపము.

శ్లో॥ "బ్రహ్మ స్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరః
సాయంకాలే సదావిష్ణుః త్రిమూర్తిశ్చదివాకరః" అని

త్రిమూర్తుల రూపాన్ని గ్రహించినట్టి నీ సూర్య రూపాన్ని కీర్తించినారు; ఇంకో కల్పమున అగ్నినుండి తేజస్సును, ఓజస్సును గ్రహించి దేవీరూపాన్ని ధరించి జీవులనందరిని కన్నబిడ్డలవలె కాపాడే మాతృతత్వాన్ని నిరూపిస్తూ జీవులకు ప్రాణాధారమైన శోణిత వర్ణాన్ని ధరించినావు. వేరొక కల్పమున జలతత్వాన్ని గ్రహించి మహాగణపతివై [ఈ గణపతి లంబోదరుడుకాడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు అతీతమైన మహామూర్తి] ముక్త వర్ణాన్ని ధరించి, సమస్త లోకాలకు అధిపతివైనావు. అటుతరువాత కల్పమున పృధివీతత్వాన్ని లీనంచేసుకొని శివరూపాన్ని ధరించినావు. ఈ రూపము మరల బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుగా త్రిమూర్తి రూపాల్ని ధరించి సృష్టి స్థితి లయముల కాధారభూతమై లోకపాలన చేసినావు. స్వచ్ఛమైన ధవళవర్ణం దాల్చితివి. ఇన్ని రూపాలు నీవు ధరించుటలో తత్వమేమనగా ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధివి అను

అయిదున్నూ జీవుల కాధారభూతమైనవి. ఇందులో ఏది లోపించినను జీవులకు మనుగడే లేదు. జీవులకు ప్రాణాధారమైన ఈ పంచభూతాల మూలతత్త్వములు నీ నుండే ఉద్భవమందెను. కాబట్టి రాఘవేంద్రా! సృష్టి స్థితి లయముల కాధారభూతమైన నిన్ను ధ్యానించుటయే ఎల్లరకు పరమావధి. ఈ పరమ సత్యాన్నే మరచినవారు ఇహ, పరలోకము లందును అనేక కష్టములు పొందెదరు. వారి సుఖజీవనానికి ముక్తిమార్గానికి అవరోధము వారే కల్పించుకొన్నవారు నిన్ను తెలిసి భజించినవారే పరమధన్యులు.

[ ఆకాశము ]

నీలవర్ణ విష్ణురూప నిన్ను గొల్చెద భక్తితో
వాయుతత్త్వ! సూర్యతేజ! నీకిదే నా వందనం.

[ అగ్ని ]

అరుణవర్ణ! దేవి! మూర్తి దేవ దేవ కావుము.

[ జలము ]

ముక్తవర్ణ! మహాగణాధిప! ముక్తినిమ్ము కరుణతో
పృధివిరూపా! పరమశివుడా! ప్రాలుమాలక బ్రోవుము
పంచభూతములన్ని నీవే, పరమతత్త్వము నీవెగా
రామమంత్రము జీవమంత్రము రామచంద్రా! నీవెగా
చేతులెత్తి శరణువేడెద జానకీజాని.

ఒకానొక సమయములో హనుమంతుడు సాక్షాత్తు బ్రహ్మదేవునకే రామనామ మహిమనుగూర్చి ఇట్లు చెప్పెను-

శ్లో॥ రామేతి మంత్రః కవయో వదంతి
ద్వ్యక్షరం నామ రఘూద్వహస్య
అస్మత్ప్రభోరస్య మహా మహిమ్నో
మనుష్య లింగస్య నరస్య పుంసః ॥

శ్లో॥ తదేవ సమ్యగ్వి లిఖోరుబుద్ధే
ప్రత్యద్రిపాషాణ శిలాసుతత్త్వత్
భవాంబుధిం యేన జనా స్తరంతి
కింకారణం దుఃఖ రమస్య తేషామ్ ॥

కవులు అనగా జ్ఞానులు రామచంద్రమూర్తి యొక్క రెండక్షరముల నామమును మహామంత్రముగా చెప్పెదురు. మానుష వేషమున దోచు మా ప్రభువైన శ్రీరాముని మంత్ర మనంత శక్తిశాలియైనది. మహాబుద్ధిశాలీ! అట్టి శ్రీరామ మహామంత్రమును సర్వపర్వతములయందు, కఠినపాషాణము లయందు, సిలలయందును చక్కగా లిఖింపుము. అద్దాన అపారమగు భవసాగరమును తరించుచుండ, దానిముందు ఈ పరిమితమైన సముద్రము లేమిలెక్క ?

జీవుల పాపములు పాషాణ సమూహముకంటెను భారమైనవి. వానిమూలమున అందరును [పాపభారాన్ని మోయ లేక] వ్యాకులత చెందుచున్నారు. ఇట్టి ప్రబలమైన పాపములన్ని రామనామమును పలికినంతనే తేలిపోవుచున్నవి. శీఘ్రముగ నశించుచున్నవి. ఇదేమాత్రము ఆశ్చ

స్థ్యము లేదు. రామనామానికి మించిన మహాశక్తివంతమైనది ఇంకేదియును లేదు.

శ్లో॥ జిహ్వాగ్రేయ స్యలిఖితం రామేతి ద్వ్యక్షరం పరమ్
కథం స్పృశంతి తం దూతాః యమస్య క్రోధ భీషణాః

'రామ' యను రెండు అక్షరములు నాలుక చివర వ్రాయబడిన పుణ్యపురుషుని [రామ యని పలికిన యెడల] క్రోధభీషణులగు యమదూత లెట్లు వానిని తాకగలరు? వారు చూడనైన చూడజాలరు. మహాపవిత్రము, తేజస్సు, గొప్పశక్తిని కలిగియుండుటయేకాక ప్రచండమైన అగ్నిలాగ పాపాల్ని దహించే రామ మహామంత్రం నరకవాసులైన యమదూతల్ని ఎల్లా దగ్గరకు రానిచ్చును? [అనగా రాని య్యదనే భావము] నరకాన్నుండి తప్పించుకోనగోరువారు అవశ్యం మనసా వాచా రామనామాన్ని జపించి, రాముని కృపకు పాత్రులు కావలెను. ఓ బ్రహ్మా! రామనామం వలన జీవులు ముక్తులు కావలెనన్న ముల్లోకములందు సలిల, వృక్ష శిలా భేదం లేకుండా అంతటా నీవు రామనామాన్ని లిఖించి నట్లయిన—సకల చరాచర జగత్తు రామనామంతో నిబిడీ కృతమై అందు చరించే సకల జీవులు రామనామ మహిమతో పునీతులై పుణ్యలోకాన్ని పొందెదరు! సుధాపూర్ణమై, అనంతమై, అత్యంత పుణ్యప్రదమైన మా స్వామి నామాన్ని గూర్చి ఎంత చెప్పినా తనివితీరదు.

పురాణాల్లో భగవన్నామము -

శ్లో॥ శివపూజా పరా మేతు శివనామ పరాయణాః
తఏవ శివతుల్యాశ్చ ఘోరే కలియుగేద్విజాః ॥

ఏ ద్విజులీ ఘోర కలియుగమునగూడ శివపూజ యందును శివనామమునందును పరమాసక్తులై యుందురో వారెల్ల సాక్షాత్తు శివతుల్యులే. శివునికి రామనామంపట్ల అత్యంత ప్రీతి. శివతుల్యులు అయినప్పుడు వారుకూడ రామ నామ మహిమను పొందగలరు. అనగా శివభక్తులైనవారు, రాముని కరుణను పొందగలరు. అట్లే రామభక్తులైనవారు శివునిదయకు పాత్రులుకాగలరు. దీనివలన శివ, విష్ణువులకు భేదంలేదని తెలుసుకోవలసింది. శివ-రామనామాల్ని భక్తితో జపించేవారు కడుధన్యులు.

శ్లో॥ కృష్ణ కృష్ణేతి కృష్ణేతి స్వపన్ జాగ్రద్వ్రజం స్తథా
యో జల్పతి కలౌనిత్యం కృష్ణరూపీ భవేద్దిసః ॥

కలియుగమున శ్రీకృష్ణ కీర్తనము చేయుటచే తాను తరించుటయే కాదు కడచిన ఏడుతరములును, ముందురాబోవు పదునాల్గు తరములును మొత్తం ఇరువదియొక్క తరముల వారినందను దరింపజేయును. నిద్రించునప్పుడును, మేల్కొన్నప్పుడును, నడచుచున్నప్పుడును అనగా సర్వకాల సర్వా వస్థలయందును నెవడు 'కృష్ణ, కృష్ణ, కృష్ణ' యను నామ ముచ్చరించునో ఆతడే కలికాలములో కృష్ణస్వరూపమును చెందును. మధురాతిమధురమైన శ్రీకృష్ణ నామాన్ని జపించుటచే అట్టివారి మవశ్శరీరాలు మధురమై, మధురమైన కృష్ణ

రూపంతో మత్తేదికం చెంది వారి వాక్కు, క్రియలుకూడ మధురవంతమే యగును. ఎవరు శ్రీకృష్ణనామాన్ని భక్తితో జపించుదురో! అట్టివారికి గోపాల దేవుని మధురమురళీగానం తీయ తీయగా వీనులందు సోకి పులకరించిన హృదయం పల్లవింపగా బ్రతుకే బృందావనంగా మారి వారి హృదయాంతర వనసీమలో శ్రీకృష్ణ దేవుడు గోపికా జనపరి వేష్టితుడై రాసలీల జరుపుతునట్లు వారి మనోనేత్రానికి గోచరించి వారి మనస్సు యశోదా ప్రేమతోనూ, మరియొక్కసారి రాధికా విరహంతోనూ, ఇంకొకసారి అక్రూరుని భక్తితోనూ నిండి పరవసింపగా గోపాలదేవుని అనేక విధములుగా ఆరాధించి చివరకు అన్ని ప్రేమలు ఏకరూపంతో అద్వైత తత్వాన్ని వహించి గోపాలదేవునిలో విలీనమైపోయి ధన్యతజెందెదరు. ఈ కలికాలంలో పాపాత్ములకు హరినామము అత్యంత దుర్లభమయినది. అట్టి దుర్లభమయిన హరినామస్మరణ సాధనచేత జపించేవారు కడుపుణ్యాత్ములు. గోవిందుని స్మరణ సకృత్తుగా చేసినప్పటికి కృతార్థులగుదురనుటలో సందేహామే మాత్రము లేదు.

అర్జనుడు శ్రీకృష్ణునితో నిట్లనెను – "ఓ జనార్ధనా! నామీాద కృపనుజూపి మానవులకి భుక్తి ముక్తులను రెంటిని కలుగజేయునదియు, సమస్త వాంఛలను నెరవేర్చునదియు, సమస్త కష్టములను తొలగించి సుఖకరమైన జీవనాన్ని కలి

గించునదియును ఏది ? సెలవిమ్ము జనార్ధనా ! నీకు నమస్క-రించుచున్నాను ".

శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పెను - 'అర్జునా ! ప్రియ మిత్రమా ! ఇందరిలోకాది పరలోక లాభముకొరకు లోకుల మేలుకొరకు నీతో నేను కొన్ని సత్యమైనవి చెప్పుచున్నాను వినుము. సదా పుణ్యప్రదమగు రెండక్షరములు గల 'రామ' నామమును నిత్యమెవ్వరు రాత్రింబవళ్లు పఠించుచున్నారో అట్టివారు అపుత్రులయినచో పుత్రులు గలిగెదరు. ఎల్ల కోరికలు నెరవేరును. ఓ అర్జునా ! వారియింట ఎల్లప్పుడును సర్వమంగళములును, సమస్త సౌఖ్యములును సిద్ధింపగలవు. 'రామ' యన్న యీ రెండక్షరములోనున్న మహిమ యింతింతయనరానిది. గంగా, సరస్వతీ,నర్మదా, యమున, సింధు పుష్కరిణులయందు స్నానమొనర్చిన ఎంతటి పుణ్యము లభించగలదో, భక్తితో ఒక్కసూరు 'రామా'యన్నంత మాత్రాననే అంత గొప్పపుణ్యము లభించును. కాబట్టి ఓ అర్జునా ! రామ మహామంత్రాన్ని సర్వకాల సర్వావస్థల యందును స్మరించి తరింపుము. "

సూతులవారిని మునులిట్లని అడిగిరి - 'ఓ సూతా ! నీవనేక పురాణములు చెప్పితివి. వానిలో ననేక ధర్మములు, కర్మములు, భగవత్ప్రీతి సాధనములు, వ్రతములు, తపములు ఎన్నియో చెప్పితివి. ఇవన్నియు కఠినమైన, నియమాలతో కూడినవి. అట్లుగాక సులభమైన తరుణోపాయము చెప్పుము

నగా చివరకు ఒకసారి 'రామ' నామ మహిమనుగూర్చి చెప్పియున్నావు కాని మాకు సంతృప్తి కలుగలేదు. మరి యొకసారి వినగోరుచున్నాము." అనగా సూతు డిట్లనెను.

"ఓ మహర్షులారా! అపార మధురము, అనంతము అత్యంత శక్తివంతము అయిన రామనామాన్ని గూర్చి ఎన్ని సార్లు వినినను తృప్తిగలుగదు, కాబట్టి చెప్పుటకు నాకును అత్యంత ఆనందమే విడుడు.

యావజ్జీవము ప్రణవము జపించినచో ముక్తి సిద్ధించును. కాని ఇది సన్యాసులకే అధికారముగలది. సంసారులు దీనిని ఉపాసించరాదు; యజుర్వేదమునందలి రుద్రాధ్యాయమును పారాయణ చేసినగూడ ముక్తి లభించును. ఇదియును మహత్తరమైన శక్తిగల నామమే! కాని దీనికి ఉపనీతులైన ద్విజులే అధికారులు. ఇదికాక కాశీలో కాపురముండి మరణించినచో ముక్తి లభించును. కాశీలో మరణించు జీవులకు పరమశివుడు రామ మంత్రము నుపదేశించి వారికి ముక్తి లభింపజేయును. కాని దీనికిన్ని ద్రవ్యము, అచ్చట నివసించు సదృష్టము ఉండవలెను. సామాన్య మానవులకు యివన్నియును దుర్లభమైనవే. వీటన్నిటికన్న అత్యంత సులభమైన మార్గమేదన అది 'రామ' నామోపాసనయే !

శ్రీరామనామము జీవములకు జీవనము. ఇది సమస్త రోగములనుండి, సమస్త పాపములనుండి, సమస్త దురాచారములనుండి విముక్తులను గావించుటయేగాక మరల మరల

ఈ సంసార బంధముల పడనీయకుండా ముక్తి నొసంగునట్టిది శ్రీరామ నామమే ముక్తినామము. అదియే ఉత్తమగతి నామమే పరమశాంతి, నామమే పరమధృతి, నామమే పరమ ప్రీతి, నామమే పరమస్మృతి, నామమే పరమ పుణ్యము, నామమే పరమతపము, నామమే పరమధర్మము, నామమే పరమగురువు, నామమే పరమజ్ఞానము, నామమే సమస్త జగత్తునకు ఆధారము, నామమే సమస్తజీవులకు జీవనప్రదాత, నామమే అనంతమైన ధనము, నామమే సత్యమైనది, నామమే ముక్తినొందగోరేవారికి ప్రియమైనది, నామమే సర్వులకు శరణు, నామమే జగత్తునకు బీజము, నామమే జగత్తును వృద్ధినొందించునది, నామమే పరమపావనమైనది. నామమే శ్రీరామచంద్రునకు అత్యంత ప్రీతికరమైనది. భావుకులకు నామజపముచే రసాత్మకమైన భగవద్భక్తి కలుగును. కామ, క్రోధ, మదమాత్సర్యాదులున్నను నామమును ఆశ్రయించిన ఎడల వారెవరైనను, ఎట్టి దుర్మార్గులైనను, రామమూర్తికి అత్యంత ఆత్మీయమైన బంధువులే! మదమాత్సర్యము లనే ఆరు దుర్గుణములను జయించినను రామనామముమీాద ప్రీతి భక్తి లేకున్నచో వారి సదాచారమంతియు బూడిదలో పోసిన పన్నీరువలె వ్యర్థమైపోవును. రామనామమే జీవులు సాధించవలసిన అమూల్యమైన తపస్సు, రామనామ మహిమనుగూర్చి చెప్పుటకు ఎన్ని నోళ్ళు, ఎన్ని నాల్కలు, ఎంత కాలమును సరిపోదు. వేయేల ? రామనామమొక్కటియే

సకలలోకములకు ఆధారమైనది. రామనామాన్ని జపించుటయే జీవుల పరమోత్కృష్ట ధర్మము.

శివుడు పార్వతితో రామనామ మహిమను గూర్చి యిట్లు చెప్పెను.

శ్లో॥ రామనామ పరోవేదో రామనామ పరాగతిః
రామనామ పరోయజ్ఞో రామనామ పరాక్రియాః
రామనామ స్సదానందో రామనామ స్సదాగతిః
రామనామ స్సదాతుష్టిః రామనామ స్సదామలః
రామనామ పరంజ్ఞానం రామనామ పరోరసః
రామనామ పరోమంత్రో రామనామ పరోజపః
రామనామ పరంధ్యానం సదాసర్వత్ర పూర్ణకమ్
రామనామ సదాసేవ్యమిశ్వరాణాం మమప్రియే
రకారాదీని నామాని శృణ్వతోమను పార్వతి
మనః ప్రసన్నతామేతి రామనామాభి శంకయా ॥

"ఓ పార్వతీ! రామనామమే సర్వత్రా నిండియున్నది రామనామమే నా కత్యంత ప్రియమైనది. వేదముల పై నే చెప్పిన విధంగా అనేకరీతులలో రామనామమే నేను ఎల్ల వేళలా స్మరింతును, 'ర' కారము మొదటగాగల నామము నైనను ఉచ్చరించుట, వినుటతోడనే అది శ్రీరామనామమే యన్న భ్రాంతితో అచ్చటికి పరుగున వెళ్ళి ఆ నామోచ్చారణలోగల మాధుర్యాన్ని నేను అనుభవించి ఆనందించెదను. మన నివాసమయిన కాశీ గొప్ప పుణ్యక్షేత్రముగా

పేరుపొందుటకు రామనామమే కారణము. కాశీలో ఎల్లెడలా శిలా, దారు, సలిల భేదంలేకుండ అంతటా రామనామమే నిండియుండును. రాముని ఆజ్ఞానువర్తినై రామతారకమంత్రము జీవులెల్లరికి ఉపదేశించుటకై కాశీయంతటను ఎల్లప్పుడు సంచరించెదను. రామనామ ముపదేశించుటయే నాకు అత్యంత ప్రియమైనది. నాకు రాముడు అత్యంత ప్రీతిపాత్రుడు. నేను రామునికత్యంత ప్రియుడను. మా ఇరువురికిన్ని భేదంలేదు. మేమిరువురు సంచరించునట్టిది కనుకనే కాశీపురమున కంత పుణ్య మబ్బెను. కాబట్టి పార్వతీ! నాకు అత్యంత ప్రియమైన రామనామాన్ని నీవున్నూ జపించి ధన్యురాలవు కావలసింది" అని శివుడు అనగా పార్వతి అత్యంత భక్తితో -

"భగవాన్ దేవేశా! నీవలన రామనామాన్ని గూర్చి వినుట నాకెంతో ఆనందకరమయినట్టిది. పరమపావనము, పాపరహితము, అనంతము అయిన రామనామము నామనస్సునందు ఎల్లవేళలా నిలుచునట్లు అనుగ్రహించ వలసిందిగా మిమ్ములను కోరుచున్నాను" అనెను. పార్వతి మాటలకు పరమశివుడు ఎంతయేని ఆనందించెను. వారిరువురు ఎల్లప్పుడును క్షణమేని విడువక రామనామాన్ని జపించుచూనే యుందురు.

బ్రహ్మ తన పుత్రుడగు నారదునితో నిట్లనెను - "వత్సా! ఎచ్చట కృష్ణ నామ సంకీర్తన జరుగునో ఆచ్చట

సమస్త పుణ్యతీర్థములు, సమస్త మంగళములు నివసించును. శ్రీకృష్ణ కీర్తనము వినగానే గరుత్మంతుని చూచి పాములు పారిపోవునట్లుగ సకల పాపములు కకావికలై పారిపోవును. సమస్త శుభములకు నిలయమయినదియు, కలిలోని పాపములు బోగొట్టునదియు, పరమ పవిత్రమయినదియు, కవి శ్రేష్ఠుల వాక్కుల ఏకైక విశ్రామస్థానము. ధర్మములకు, చరాచర జగత్తుకు బీజము, వృద్ధికారకము అయిన భగవన్నామమే సర్వులకు శ్రేయోదాయకమైనది, అత్యంత పఠనీయమైనది. 'రామా, కృష్ణా, మాధవా, జనార్ధనా' అని నోరారా ఒక్కసారియైనను బలుకనివాని జన్మము జన్మకాదు. అట్టివారు క్రిమికీటకాదులకంటె హీనాతిహీనులు. ఇష్టముతోగాని, అయిష్టముతోగాని ఆఖరున స్వప్నమందైనను సరే 'రామా' యని ఉచ్చరించినవారే ధన్యులు అట్టివారిదే పవిత్రమయిన జన్మ.

రమణమహర్షి "భగవన్నామము అత్యద్భుతమైనది. శక్తిగలది. అది స్థూల, సూక్ష్మ, కారణ దేహములను మరిపింపగలదు. నామ జపమున్నా యోగమే యగును. యోగము, ధ్యానము, తపస్సు అన్నియు నామ జపంవల్లనే సిద్ధించును. కనుక నామ జపము ఎల్లరకు ఏవిధమయిన సందేహము లేక అవశ్యము చేయతగినది" అనెను. ఈ విధముగా ఎందరెందరో భక్తవరేణ్యులు చెప్పియున్నారు.

శ్రీవాసుదాస స్వామివారు –

శా. స్నానంబుల్ జపముల్ తపంబులును సంధ్యల్ నిత్య
కర్మావళుల్
నీ నామంబున కీడురావు భవపాళిందుంపగావేమి, రా
మా నీనామమె యెక్కిటిందునుము జన్మశ్రేణిభూతాళికిన్
తన్మావాధా ! హరి యొంటుమిట్ట రఘురామా ! భక్త
కల్పద్రుమా !

శా. ధ్యానాసక్తులు యోగమార్గమున హృత్పద్మస్థమా
తేజమున్
గానం గానిపడంగ మిమ్ము మిథిలాకన్యేశ ! తన్మద్యాగం
బానీ నీలసురూపముంగనంగ నభ్యర్థింతు నీనామమే
యేనాఁటన్ గతియొంటిమిట్ట రఘురామా ! భక్తకల్ప
దుమా.

పోతనగారు –

గీ॥ చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువడేని
దయయు సత్యంబులోనుగా దలపడేని
కలుగు నేటికి తల్లుల కడుపుచేటు.

ఈ విధంగా ఎందరో మహాత్ములు భగవంతుని ఉనికిని నిరూపిస్తూ భగవన్నామ నిష్ఠాగరిష్ఠులై తపస్సు, ధ్యానము, కీర్తనముల చేసి భగవంతుని రూపాన్ని చూడగోరి తపించి, వేడుకొని, మ్రొక్కి, సోలి, దోసిలిఒగ్గి 'స్వామీ ! ఒక్క

కూరు నీ మంగళకర రూపాన్ని చూపి మమ్ములను ధన్యులను గావించుము; ఇంతకన్నా మేము ఇహాపరములందు కోరు కోరిక లెవ్వియును లేవు' అని దీనాతిదీనంగా వేడుకొని చివరకు స్వామి అనుగ్రహానికి పాత్రులై భగవంతుని చిన్మయ స్వరూపాన్ని తమ హృదయమందే వీక్షించి తరించి చరితార్థులైనారు.

అట్టి మహాత్ముల చరణారవింద సేవయే పామరులకు ముక్తిమార్గము. భగవానునికి ప్రీతికరమయినట్టిది కూడ అదియే. స్త్రీ, పురుష, బాల వృద్ధ వివక్షత లేకుండా సర్వులూ నామజపం చేయవచ్చును, నామము వలన ఎవరో కొందరు కాదు అందరును తరింతురు. పరమ భక్తశిఖామణులుగా ప్రసిద్ధిగన్న హనుమంతుడు, అజామీళుడు, పింగళ యను ఒకానొక వేశ్య, పుష్కరుడు, పుష్కరుని వలన నరక వాసులు, ఖట్వాంగుడు, పరీక్షితుడు, ద్రౌపది, అర్జునుడు, నారద, ప్రహ్లాద, పరాశర, అంబరీష, వ్యాస, శౌనక, భీష్మ, రుక్మాంగద, బలి, విభీషణాది ఎందరెందరో భగవన్నామము కీర్తించి తరించినవారే! అట్టి మహనీయుల మార్గమే అవశ్యం అనుసరణీయమైనది.

రామతారక శతకకారుడు ఎంతో మనోజ్ఞంగా రాముని లీలాగుణ విశేషాలను మనోమోహనంగా కీర్తించాడు. ఆ కీర్తనలు విన్నవారు ఎంతటి జడులైనా, కఠినాత్ములైనా, నాస్తికత్వం జీర్ణించిన వారైనా సంతోషతుందిల

మయిన మనస్సుతో ఆనందబాష్పాలు జాలువారే కనులు మూసి రామమూర్తిని మనస్సునందూహించి మధురాతి మధురమైన భక్తిరసవాహినిలో తన్మయులగుదురు.

రామతారక శతకము –

మధుర శర్కరక్షీర దధిఘృతంబులకంటె
రామనామామృత రసము తీపి
పనస జంబు ద్రాక్ష ఫలరసంబులకంటె
రామనామామృత రసము తీపి
నవసుధా పరమాన్న నవనీతములకంటె
రామనామామృత రసము తీపి
రామనామంబునకు నేది సాటిరాదు
రామనామంబు సేవించి నారదుండు
బ్రహ్మఋషి యయ్యె నిహమందు బడవినొందె
రామతారక దశరథరాజ తనయ.

శ్రీమంతుడగు రామచంద్రుల దలచిన
నజచేత మోక్షంబు నందినట్లు
ఓ రామ హరియని యొకసారి దలచితె
దుఃఖ దోషములన్ని దొలగిపోవె?
నొనర రెండవసారి యో రాఘవా! యన్న
బహు భోగభాగ్య సంపదలు గల్గు
రమణ నాల్గవసారి రామచంద్రాయన్న

అతని ఋణస్థుడవయ్యా నీవు
రామతారక దశరథరాజ తనయ.

రామ రామాయని రంజిల నావంతు
నిజముగా రక్షింప నీదు వంతు
నీ పాదపద్మంబు శరనమ్మ నా వంతు
నిజముగా రక్షింప నీదు వంతు
అపరాధినని పల్కి యాచింప నావంతు
నిజముగా రక్షింప నీదు వంతు
నేను పంతంబు తప్పక నిన్ను గొల్తు
నీవు పంతంబు తప్పక నిర్వహింపు
పంతమిది నీకు నాకును పరమపురుష
రామతారక దశరథరాజ తనయ.

నీలమేఘశ్యామ నిగమగోచర రామ
ఫాలలోచన వినుత పరమపురుష
దశరథనందన తాటక మర్ధన
యిందీవరేక్షణ యినకులేశ
అయోధ్యపురవాస యాశ్రిత జనరక్ష
కల్యాణగుణ ఘోర కంసహరణ
విధి శివరక్షక విష్ణు స్వరూపమా !
బుధజన పాలక పుణ్యపురుష

జానకీనాథ! మీకును జయము జయము
సకల బ్రహ్మాండనాయక! శరణు శరణు
కాచి రక్షింపు నన్నును కామజనక
రామతారక దశరథరాజ తనయ.

రామనామామృత రసమ్ముద్రావే కదా
మున్ను జామీళుండు ముక్తుడగుట
రామనామామృత రసమ్ముద్రావే కదా
మునిపత్ని శాపవిముక్తి యగుట
రామనామామృత రసమ్ముద్రావే కదా
కపివీరుడును భక్తి కలితుడగుట
రామనామామృత రసమ్ముద్రావే కదా
యపవర్గ మిచ్చె ఖట్వాంగునకును
కోరి శ్రీరామనామామృతంబు సేయ
ముక్తిమార్గంబు కలుగును మూఢులకును
రామతారక దశరథరాజ తనయ!

చిరకాలమున నేను స్థిరమని యంటినా?
జన్మ జన్మంబులు చెప్పనేల?
శ్రీకృష్ణనామంబు స్థిరమనియంటినా
భయనివారణమూను పరమపురుష!
హృషీకేశ మిమ్ము హృదయంబులో నిల్ప
కరుణతో గాతువు కమలనయన

సన్నుతించెద నిన్ను కౌసల్యతనయ !
చిత్తగించుము నాయన ! శ్రీనివాస
శరణుజొచ్చితి, నీకును శరణు శరణు
రామతారక దశరథరాజ తనయ.
శ్రీరామ శ్రీరామ శ్రీరామ యని
మిమ్ము స్మరణచేసెదనయ్య చక్రపాణి !
కోదండ కోదండ కోదండరాముని
కొలిచి సేవించెద కోర్కెదీర
పద్మసంభవ వినుత ! పరమపురుష !
నన్ను గాచియు రక్షింపు నయముతోడ
కరుణతోడను ననుచూడు కమలనయన !
రామతారక ! దశరథరాజ తనయ !

ఈవిధంగా ఎంతో మధురంగా ఉంటుంది శతకమంతాను. రామనామంకన్నా మధురమైంది లేదని ఘంటాపథంగా చెప్పటమేగాక "రామచంద్రా ! భక్తసులభుడవని, దీనజన రక్షకుడవని, దయార్ద్రహృదయంకలవాడవని ఎన్నో బిరుదులున్నాయట నీకు. నిన్ను నమ్మి పూజించేవారిని ఎట్టివారైనా వారిని రక్షించే బాధ్యత తీసుకుంటానని పంతంగూడ పట్టేవుటగా ! కాబట్టి నిన్ను నమ్మి పూజించటం నావంతు; నన్ను కాచిరక్షించటం నీవంతు. నీ చరణారవిందాన్ని భక్తితో పూజించి, నిన్ను మెప్పించి వరాలు పొందాలనే పంతంతో నిన్ను కొలుస్తున్నాను. మరి భక్తు

లను రక్షిస్తాననే నీపంతాన్ని నీవూ చెల్లించుకోవాలయ్యా! ఇది నీకూ నాకూ పంతం. ఇందులో గెలుపు ఎవరిదో చూద్దాం!" అని భగవంతునితోనే పందెం వేస్తున్నాడీభక్తుడు.

ఈ భావం చాలా గొప్పగావున్నది. భక్తుడు భగవంతునితో పందెమునకు దిగితే భగవంతుడే ఓడిపోకతప్పదు. ఎందుకనగా భక్తసులభుడుగదా మరి! భక్తుల భగవత్సేవకూ పూజా కీర్తన సేవలకు మెచ్చి ఆ స్వర్గాన్నుండి దిగివచ్చి భక్తుల హృదయములో నివాసం ఏర్పరుచుకోక తప్పదు. సాక్షాత్తు భగవంతుణ్ణే తమ హృదయాలలో బందీగా చేయగలిగే భక్తవరేణ్యులకన్నా మహాత్ములు, పుణ్యవంతులు మరెవ్వరూ ఉండబోరు.

సక్కుబాయి ఆ విధంగానే భగవానుని శ్రీకృష్ణుని తనవద్దకే రప్పించుకున్నది. ఆమె యోగరహస్యాలు ఎరుగదు, తపస్సు చేయలేదు. నియమబద్ధమైన జీవితాన్నీ గడపలేదు. అయినప్పటికీ భక్తితో మనసార నమ్మి ఆమె చేసిన సంకీర్తనలకే మెచ్చి శ్రీకృష్ణుడు ఆమెకు సేవకుడై ఆమె ఇంట సేవలు చేసెను. అది విన్నవారి హృదయాన్ని పులకరింపజేసి ఆశ్చర్యచకితుల్ని గావించే రమణీయమైన ఘట్టం.

ఆ విధంగానే భక్తపోతన భాగవతకావ్యం వ్రాసేటప్పుడు ఒకొక్కప్పుడు రచనాసందర్భానుసారమైన భావాలందక చికాకుపడితే, సాక్షాత్తు శ్రీరామచంద్రమూర్తేవచ్చి

భాగవత రచన చేసేవాడట. నలువరాణి శారద శరదిందు చంద్రిక లాగా వారింట నడయాడుతూ పోతన అనుంగు పుత్రికలాగా గారాబాల్ని అందుకుంటూ, పోతనకు చక్కెర పాకంలాంటి భావనాచాతుర్యాన్ని అందించేదామె. ఆమె కలిగించిన మనోహరము, మనోజ్ఞము. మధురాతిమధురము అయిన భావాలు భాగవతంలో తీయని తేనియవాకలై ప్రవహించి చదువరుల హృదయాల్ని తేనెపెరలుగా మార్చివేసే మధుర మనోహర రసధుని భాగవతం.

'వాణి నారాణి' యని సమకాలీన పండిత కవులతో సవాలుచేసిన పినవీరనకు వాణి అందాలరాణి వచ్చి అతగాడి కావ్యాన్ని తానే రచించేదట.

ఈ విధంగా ఎందరో భక్తులు భగవత్ సాక్షాత్కారం సహాకారముపొంది ధన్యులైనారు.

శ్లో॥ భగవతో యశోగానం విష్ణోః కీర్తన ముచ్యతే
కృష్ణాది విష్ణునామ్నాంతు రటనంవా ముహుర్ముహుః

భగవంతుని యశోగానము, కృష్ణాది విష్ణునామము అను మాటిమాటికి బలుకుట విష్ణుకీర్తన మనబడును. కాబట్టి భక్తులైనవారు భగవానుని నామ, రూప, గుణ, లీలా విశేషాల్ని కథలు, గాథలుగ వినుట, కీర్తించుట అనే శుభకరమైన లక్షణాలు అలవర్చుకొని సర్వవేళలా 'ఓ నందాత్మజా! భక్తవత్సలా! హరే! నా ప్రార్థనను వినుమయ్యా నీ రోమము లెన్నిగలవో! అన్ని బ్రహ్మాండములు కలవు. ఎన్ని బ్రహ్మాం

డములు నీయందు గలవో! నాకన్ని నోళ్లుండవలెను అన్ని నోళ్లతో అన్నన్ని జిహ్వలతో 'కృష్ణా, కృష్ణా' యని మాటి మాటికి నిన్ను గీర్తించవలెను. ఓ హరే! నాకీ వరదానము మాత్రము నిమ్ము, మరింకేమియు వలదు" అంటారు మహా భక్తులు కాన్సి గోపాలదాసస్వామి.

అదే నిజమైన భక్తికి పరాకాష్ఠ. "నీ గుణకీర్తనము, శ్రవణము, స్వరూపధ్యానముచేసి చండాలురు సహితము పరమ పవిత్రులగుచున్నారు. ఓ కృష్ణా! నీ పాదరజాన్ని నా కొసంగి నన్ను ముక్తుడను గావించు" అని మనసా వాచా కర్మణా భగవంతుని శరణుపొందిన జీవులు భగవానుని కరుణకు పాత్రులై ముక్తినొందెదరు. భగవంతుని సుందరరూపమును మనస్సునందు నిలిపి మంగళకరనామాన్ని మాటిమాటికి ఉచ్చరించి శ్రీనివాసుని సదా చిత్తమందు నిలిపి ధ్యానించేవారి హృదయం రాకాసుధాకర వీచికల కుత్తుంగ తరంగాలతో ఎగసిపడే క్షీరజలధినోలె పొంగులెత్తి క్షీరసాగరశయనుని అందుకోవాలని ఆరాటపడుతుంది. భగవానుని మధుర సన్నిభమైన నామాన్ని అత్యంత ప్రీతితో ఉచ్చరించే జిహ్వ మరియే ఇతర నామాన్ని పలుకుటకు ఇష పడదు. మకరందాల్ని గ్రోలి మత్తిల్లే మధుపంలాంటి మనస్సు భగవానుని పాదపద్మాల మకరందాన్నే పానం చేయటానికి ఇష్టపడుతుంది గాని మరో పుష్పాల జోలికిపోదు. అందుకే భక్తపోతన "మందార మకరంద మాధుర్యమున

దేలు మధుపంబుపోవునే మదనములకు" అన్నాడు. అంతే కాదు

అంబుజోదర దివ్యపాదార విందా
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు?
వినుతగుణశీల! మాటలు వేయునేల?

అని భగవంతుని పాద సరోజామృతాన్ని గ్రోలిన మనస్సు వేరొకచోటికి పోనేపోదని ఘంటాపథంగా చెప్తూనూ మరోమాటకు తావేలేదు అన్నాడు. అవి భక్తశిఖామణి అనుభవైకవేద్యమైన మాటలేగదా! ఇందులో వాదనకు తావేమున్నది? అంతటి మధురానుభవం అపారమైన నమ్మిక కలగాలంటే, ఎవరికివారే భగవంతుని నమ్మి భజించి తెలిసికోవలసిందే! అది ఏవిధంగానంటే భగవంతుని గురించిన కథలు చదువుట, కావ్యేతిహాసాల్ని మననం చేసుకొనుట, గుణకీర్తన చేయుట వీనివలన భక్తి అనే మధురానుభవం కలుగుతుంది.

అందుచేతనే భక్తశిఖామణి ప్రహ్లాదుడు —

"చదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు! నే
చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!"

అని 'ఏమి చదివితివి నాయనా' యని తండ్రి యడుగగా చెప్పేడు.

ఆ విధంగా ధర్మార్థ శాస్త్రాలు చదివినప్పుడే భక్తి యుతమై, తేజోవంతమైన మనస్సు భగవంతుని పాదాల మీదే నిల్చి మమైకం చెందుతుంది. అసలు భగవానుని నామ గుణ రూపాల్ని కీర్తించని, చదువని, తలవని జీవులు ఉండనే ఉండరు. భక్తిచేగాకున్నా అపనమ్మకం చేతనైనా భగవన్నామోచ్ఛరణ కావిస్తూనే ఉంటారు. కొందరు తెలియకుండనే తమ ప్రయత్నం లేకుండగానే భగవానుని మహిమోన్నతమైన గుణాల్ని కీర్తిస్తారు.

అది ఏవిధంగానంటే, ఇదిగూడా పోతన గంటంనుండి జాలువారిన మధుర గుళిక. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని ఎత్తుకొని రథంమీద ఇడుకొని పారిపోతున్నప్పుడు కృష్ణుణ్ణి పరుషంగా తూలనాడుతున్నాడీ విధంగా రుక్మి –

మా సరివాడవా మాపాపఁగొనిపోవ?
నేపాటిగలవాఁడ, వేదివంశ
మెందు జన్మించితి వెక్కడ బెరిఁగితి
వెయ్యది నడవడి, యెవ్వఁడెఱుఁగు
మానహీనుడ! నీవు మర్యాదలెఱుఁగవు
మాయఁ గైకొనికాని మలలరావు,
నిజరూపమున శత్రు నివహంబుపైఁబోవు
వసుధేశుఁడవుగావు వావిలేదు.
కొమ్మనిమ్ము నీవు గుణరహితుండవు
విడువు విడువదేని విలయకాల

శిఖి శిఖా సమాన శిత శిలీముఖముల
గర్వమెల్లఁగొందుఁ గలహమందు.

అన్నాడు రుక్మి. పైకిచూచిన ఇవన్నియు నిందలే. రుక్మి నిందలుతప్ప అభిసందలు చేసేవాడా మరి? అయినా ఆ దుష్టుడు తనకు తెలియకుండగనే భగవంతుని పరతత్త్వాన్ని కీర్తిస్తాడు.

కృష్ణుడు రుక్మికి 'సరివాడుకాడు' నిజమే అందరికి అతీతుడు. అతడు ఏపాటిగలవాడు? ముల్లోకాలే అతనివి. ఆసిరియే అతనిది. ఏది వంశం? విష్ణుమూర్తికి ఒక వంశం మంటూ ఉంటుందా! 'ఎందు జన్మించితివి'? – జన్మలేనిదే! ఎక్కడ పెరిగితివి? – పెరుగుట విరుగుట నరులకు, నారాయణుని కెక్కడిది? 'ఎయ్యది నడవడి'? నడిపించేవాని నడవడి ఎవరెరుగును? 'మానహీనుడవు'? –అశరీరునకి, ఆత్మసిద్ధునికి మానప్రసక్తి ఏది? 'మర్యాద లెరుగవు' అనంతుడతడు, 'మాయగైకొనిగాని మఱలరావు' సర్వమూ అతనిమాయే 'నిజరూపమున శత్రు నివహంబుపైబోవు' అన్ని రూపాలు అతనివే, 'వసుధేశుడవుకావు' నిజమే వసుధకేగాదు చతుర్దశ భువనాలకే అధీశ్వరుడు, 'వావిలేదు' త్రివిక్రమునికి క్రమంతో నిమిత్తం లేదు, 'గుణరహితుడవు' గుణత్రయము జీవకోటికి, గుణాతీతునకేటికి?

ఈ విధంగా తనకు తెలియకుండానే రుక్మి కృష్ణుని పరతత్త్వాన్ని కీర్తించాడు. పోతన భాగవతంలోని మధుబిందువు

లాటి యీ పద్యానికి డా॥ సి. నారాయణరెడ్డిగారి మధుర మనోహర కమనీయ వ్యాఖ్యమిది. దీనిని చదివినప్పుడు ఆనంద బాష్పాలు అవిరళంగా జాలువారని భక్త హృదయం వుంటుందా? సందేహమే!

భక్తిచేతను భక్తులెల్లరు
వైరిచేతను శత్రులెల్లరు
పవలు రేలును పలవరింతురు
కృష్ణ కృష్ణా మాధవా యని.

అన్నారొకరు. నిజానికి భక్తిగలవారికన్నా భక్తిలేని వారే భగవానుని ఎక్కువగా తలుస్తారు. భగవానుడు 'లేడు లేడు' అని పదేపదే భగవంతుణ్ణి తలుస్తారు నాస్తికులు. అదే భగవానుని మహిమ. తన ఉనికిని నమ్మని వారినికూడా తన నామోచ్చరణతో పునీతుల్ని గావించి తనలో చేర్చుకుంటాడు. ఇక భక్తుల సంగతి చెప్పవలెనా? ఎన్ని జన్మాంతరాల పుణ్యవశంచేతనోగాని భక్తి అలవడదు. అలాటి భక్తి ఉదయించేనా భగవానుని పరిపూర్ణమైన కరుణకు పాత్రులైన ధన్యజీవులువారు. అలా పుణ్యవశంచేత భక్తి అలవడకపోయినను ప్రయత్నపూర్వకంగా భగవానుని గురించి తెల్సుకోవాలని మహామహుల శుశ్రూషవలన, భాగవతాది గ్రంథ పఠనాదులవలన, భక్తి అలవర్చుకొని భగవంతునిమీద దృష్టి నిలిపి భగవన్నామం అనుక్షణం కీర్తించేవారున్నా పుణ్యాత్ములే! ఉత్తమోత్తమమైన మానవజన్మ వృథాకాకుండ,

అతిమధురము, అనంతము, అమోఘము అయిన భక్తిని అలవర్చుకొని దేవదేవుణ్ణి సేవించి తరించుటయే ఉత్తమమైన మానవజన్మకు చరితార్థత. అనేక విధములుగ కలుషపూరిత మైన కలియుగంలో తరించటానికి భగవద్భక్తి తప్ప వేరు మార్గంలేదు. ఈ సంగతే నారద భక్తిసూత్రములలో అనేక విధములుగా చెప్పియున్నారు. మునులు, యోగులు మొదలైనవారు తపస్సుచేతను, యజ్ఞయాగాదులచేతను, యోగనిష్ఠవలనను అనేక కఠిన నియమాలతోను భగవంతుణ్ణి ఆరాధించి, భగవానుని కరుణకు పాత్రులై తరించారు. కాని ఈ కలియుగంలో మానవులకు అంతకఠినమైన నియమాలు అనుసరించే అవకాశం లేదు. ఎందుచేతననగా కలియుగంలోని జనులు అల్పమేధస్సు, అల్పబుద్ధి, అల్పాహారము, అల్పశక్తి, అల్పనిద్ర, అల్పసంకల్ప వికల్పాలు కలిగియుందురు. అటువంటి అల్పచేతస్కులైన జనులు కఠిన నియమాలతో భగవంతుని ఆరాధించజాలరు. కాబట్టి కలియుగంలో మానవులు తరించటానిక భక్తితప్ప వేరు మార్గంలేనేలేదు. అందువలనే కలియుగంలోని మానవులకొరకై వ్యాసాది మహర్షులు భగవంతుని గూర్చిన కథలు, అనేక పురాణేతిహాసములు రచించి మానవులకు అందుబాటులోనికి తెచ్చారు. అలాటి పురాణ గ్రంథాలు, వేదశాస్త్రాలు చదివినట్లయిన అపారజ్ఞానం కలుగును. భక్తిజ్ఞానములు రెండున్నూ భగవంతుని తెలుసుకునే సులభమార్గాలు.

భగవానుని నామోచ్చరణ. సంకీర్తనము అత్యంత సులభతరమైనది. ముక్తినొందగలిగే ఇంత సులభోపాయం మన ఎదుటనుండగా – అజ్ఞానాంధకారంలో అవివేకంతో, జ్ఞానజ్యోతిని చూడలేని మూఢుల సంగతి ఏమనాలి? అత్యంత సులభము, ముక్తిమార్గము అయిన భక్తిని అలవర్చుకొని అనుక్షణం రామనామామృతపానం చేసినవారి హృదయం అమృతసింధువే యగును. అట్టివారి భాగ్యమే భాగ్యము. అమృతతుల్యమైన భక్తిని సాధించవలెనన్న సంసారమును త్యజించి అడవులలోనికి పోనవుసరంలేదు. గృహస్థుగానేఉండి, గృహస్థధర్మాన్ని నెరవేరుస్తూ, దారాపుత్రాదుల పోషణభారం వహిస్తూ, అతిథిఅభ్యాగతులను ఆదరిస్తూ, వినయ వివేక సంభాషణ మొదలగు సద్గుణాలు అలవర్చుకొని, నాది నేను అన్న స్వార్థభావాన్ని వదలి నిర్మలమైన మనస్సుతో తన కర్తవ్యాన్ని తాను నిర్వహిస్తూనే భగవంతుని పవిత్రమైన కథలతో నిండియున్న పురాణేతిహాసాలను వినుచు, చదువుచు కాలాన్ని వృథావివాదలతో దుర్వినియోగం చేయకుండ అనుక్షణం భగవంతునియెడలనే మనస్సు కేంద్రీకరించి, సద్గురువులద్వారా భగవత్ తత్త్వాన్ని తెలిసికొని, భక్తినే విని, భక్తినే చింతించి, భక్తితో రామనామాన్ని జపించినట్లయిన ఆత్మసాక్షాత్కారము కలుగును. అదియే భగవత్ సాక్షాత్కారము. ఈ విధంగా సంసారములో ఉండియే భక్తితో భగవంతుని సేవించి తరించవచ్చు

నని ఎందరెందరో మహానుభావులు చెప్పియున్నారు. సామాన్య మానవులకిదియే సులభమైన చక్కని మార్గము. సంసారబంధాల్ని త్యజించి అడవులలోనికిపోయి, కఠినమైన నియమాలతో యోగము, తపస్సు మొదలగునవి చేసినట్టి వారికి, ఎప్పుడైనా కర్మవశాన సరియైన రీతిలో వారి నియమాలు సాగక విధ్యుక్తధర్మాలను అతిక్రమించిన యెడల అప్పటివరకు వారు చేసిన సాధన అంతా వ్యర్థమైపోవును. మరల వారు సరియైన మార్గంలోకి రావడం ఎంతో కష్టము?

భక్తి అలాకాదు. భక్తితో భగవన్నామ సంకీర్తన చేసినప్పుడు అపారమైన ఆనందరసాబ్ధి కలుగును. ఆ ఆనందము మాటల్లో ఇముడలేనిది. ఎవరికివారే అనుభవించి తెల్సుకోవల్సింది. ఒకసారి భక్తి అనే మాధుర్యానుభవాన్ని పొందినవారు ఇక ఎన్నటికి ఆ అనుభవాన్ని వదలటానికి ఇష్టపడరు ఇదియే భగవన్నామంలోని మహిమ. ఇదియే సర్వులూ ఆచరించదగినది. యోగులు మొదలైనవారికన్నా భక్తమార్గాన్ని అనుసరించేవారికే సులభంగా ముక్తిలభించును. ఇందుకు కావలసినదల్లా నిశ్చలమనస్సు, నిర్మలభక్తి రామనామంపట్ల అనురక్తి నిజమైన సాధకులకు ఇది ఎంతయో సులభమార్గమేగదా!

భగవన్నామాన్నిగూర్చి, భక్తిజ్ఞానాన్నిగూర్చి ఎన్నిసార్లు చెప్పినా పునరుక్తి దోషంలేదు. నిర్మలమైన భక్తితో భగవంతుణ్ణి మనం ఏ రూపంతో ఆరాధిస్తే ఆ రూపంతోనే

మనకు సాక్షాత్కరిస్తాడు. కరుణామయుడైన భగవానుడు ఏ భావంతో మనము భగవంతుని ప్రేమిస్తే, తిరిగి అదే భావాన్ని మనపట్ల కనపరుస్తాడు. పదకొండు విధాలైన భక్తిలో ఏ మార్గాన్ననుసరించినా భగవంతుని ప్రేమను పొందుటకు కొంచెమైనా సందేహములేదు.

గుణమహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, పరమవిరహాసక్తి. ఈ పదకొండు విధాలయిన భక్తితో భగవంతుని నిరంతరం సేవించిన వారందరూ కృతార్థులై ముక్తి పొందెదరు. ఇది నిస్సందేహము సాక్షాత్తు బ్రహ్మ మానసపుత్రుడైన నారదుడే భక్తితోనే భగవంతుణ్ణి చేరవచ్చునని చెప్పినప్పుడు ఇక సందేహమునకు, వాదనకు తావేమున్నది ?

దశావతారాలేకాక మరెన్నో రూపాలతో, ఎన్నో గుణాలతో భగవానుడు ఎందరెందరో మహాత్ములచేత కీర్తింపబడుచున్నాడు. అన్ని రూపాలలోను 'రామ' రూపమే ఉత్కృష్టము, మనోహరమైనది. అన్ని నామాలలోనికి రామ నామమే పవిత్రము, పరమ సుధాపూర్ణము, పరమపదాన్ని చేర్చే సులభోపాయము. ఇట్టి మహిమాన్వితమైన రామ నామాన్ని నిరంతరం జపించే మహాత్ముల పాదధూళి శిరస్సున దాల్చినా జన్మ చరితార్థమే అవుతుంది. అందుచేతనే రామదాసు ఎన్నికష్టాలు పడ్డప్పటికిన్నీ తాను నమ్మిన దైవం

రాముని విడువలేదు, రామనామాన్ని మరువలేదు. ఏ దైవము రామునికి సాటిరాదని గట్టిగానమ్మి తదితరులకు నమ్మకము కలిగించారు.

చక్కెరమాని వేము దినఁజాలిన కైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవముల వేమఱు గొల్చెదరట్ల కాదయా!
మ్రొక్కిన నీకె మ్రొక్కవలె మోక్షము మొసంగిన నీవె
యీవలెన్
దక్కిన మాటలేమిటికి? దాశరథీ కరుణాపయోనిధీ.

కొలిస్తే రామునే కొలవాలి. మోక్షమిచ్చినా రాముడేఇవ్వాలి. ఏ దైవానికి ఇదీ సాధ్యంకాదు. ఓ మానవులారా! మధురాతిమధురమైన రామనామసుధను పానం చేయక వేపచివుళ్లు తినే అధములు కావద్దు! అని చెప్పటమే కాక

అండజవాహ! నిన్ను హృదయంబున నమ్మినవారి పాపముల్
కొండలవంటివైన వెసగూలి నశింపక యున్నె? సంతతా
ఖండలవైభవోన్నతులు గల్గక మానునె? మోక్షలక్ష్మికై
దండ మొసంగకున్నె! తుద దాశరథీ కరుణాపయోనిధీ!

అజ్ఞానాంధకారంలో మానవులుచేసిన పాపాలు కాటుక కొండవలె పెరిగినప్పటికి అండజవాహనుడైన ఆ శ్రీరాముని పాదపంకజములు హృదయములోనిల్పి భజించి నట్లయిన అజ్ఞానసంచితమైన పాపాలన్ని నశించటమేకాక ఇహంలో సిరిసంపదలతో తులతూగే భోగాల్ని అనుభవించి

చివరిలో వారికి మోక్షలక్ష్మి చేయూతనిచ్చి పరమపదాన్ని చేర్చుతుంది. అంతటి మహిమాన్వితమైన రామనామాన్ని జపించి తరించండి పామరులార! అని గొంతెత్తి చాటుతున్న రామదాసు మాటలు సర్వులకూ శిరోధార్యమేకదా !

అతి దుర్లభమయిన మానవ జన్మ వృధాకాకుండ సఫలమయి భగవానుని పదపద్మాలుచేరి ముక్తిని పొందవలె నన్న భక్తి యొక్కటియే మార్గము. మరోమార్గము లేనే లేదు. పంకనాభుని పాదపద్మములయందు అవిరళంగా జాలువారే అమృతధారల్ని గ్రోలి అమరత్వాన్ని పొందవలెనన్న మనస్సు తేనెటీగవలె ఆ పాదపద్మములపై వ్రాలి ఆ మధుర రసాన్ని ఆస్వాదించాలి. అందుకు భక్తి అనే రెక్కల ఆధారంతో మనస్సు మధుకరమై మాధవుని పదపద్మములు చేరుతుంది. ఆ భక్తి అనే ఆధారం కొరకే మానవులు నిరంతరం కృషిచేయాలి. అదే భగవదన్వేషణ, అదియే భక్తి, అదియే ముక్తి. అందుకొరకే మానవజన్మ వినియోగం కావాలి.

ఆదిదేవుడైన పరమశివుడు నిరంతరం రామనామాన్ని జపించుచూ రామరూపాన్ని ధ్యానించుచు, ఆత్మానందాన్ని పొందుచు రామనామ సహాయంతో కాశీలో మరణించే మానవులు ఎంతటి అఘములయినప్పటికి ఎంతో కరుణతో వారికి ముక్తిని కలిగించుచు, రామునిపట్ల అత్యంత ప్రేమాస్పదుడై ఉన్నప్పుడు సామాన్య మానవుల సంగతి చెప్పవలెనా ? శ్రీరాముడు రామావతారాన్ని ఉపసంహరించి

శ్రీమహావిష్ణు స్వరూపుడై పరమపదానికి వేంచేసినప్పుడు పరమశివుడు పరమానందభరితుడై శ్రీమహావిష్ణువునవేక రీతుల్లో కొనియాడి తన సంతోషాన్ని వెలిబుచ్చి రామావ తార ఉత్కృష్టతను, మహిమను త్రిభువనాలయందు సాటి లేదని మనోహరంగా కీర్తించినాడు.

శా. విశ్వాసంబున నార్తిమాన్పుడని ఈవేల్పుల్ మిమున్ వేడినన్
విశ్వామిత్ర విలుంఠనంబునకు నావిర్భావమున్ చెందియా
విశ్వామిత్ర హితంబు ముందుగ నొనరిన్ చేసి చెల్వొందు మీ
శశ్వచ్చిత్ర చరిత్రమున్ దలతు నశ్రాంతంబు స్వాంతంబునన్.

కం. గురువులకు నాదికారణ గురుడని
ప్రఖ్యాతి గనియు గురునాజ్ఞవనాం
తరమున గాంతా సంగలి
జరియించిన మీ చరిత్ర శక్యమె పొగడన్.

అని వేయువిధాలుగ ఆనందతరంగిత మనస్కుడై "రామా! గురువులందరికి ఆదిగురువువు నీవే! దేవతలంద రికి ఆదిదేవుడవు నీవే! సకల ధర్మముల సారము నీవై ఈ సకల చరాచర జగత్తుకు ఆధారభూతమును, సృష్టి, స్థితి, లయాలకు కారణమున్నూ నీవే అయివుండికూడ బృందార కుల ఆందోళిత హృదయాలకు స్పందించి బాధచెంది వారికి

అభయమొసగి వారి బాధాభయాలను బాపి, అసురులను బరిమార్చుటకై కలుముల జవరాలితో కూడి మహనీయమైన సర్వసుఖాలను వీడి భూమిమీద మానవజన్మమెత్తి, మానవ సహజమైన సుఖదుఃఖాల ననుభవించి, తండ్రిమాట జవ దాటక పాటించి, భూపుత్రీ సమేతుడవై, లక్ష్మణుని సేవ లందుకొనుచు, వనాంతసీమలలో కేవలం సామాన్య మానవు నివలె సంచరించి, భార్యా వియోగాన్ని భరించలేక, శోక తప్తుడవైన నీకు బలధైర్యసముజ్వలోన్నత మహావీరుడు హనుమంతుడు సేవకుడై ఆప్తుడై సీతాక్షేమవార్త నందించి ఆర్తనిదీర్చి అనుతాపం బాపగా, వానరసైన్యంబుతో వారధిదా పగతుడైన పలక్తివదనుని బరిమార్చి, సీతాసమేతుడవై సాకేతపురికి కేతెంచి, పట్టాభిరాముడవై ప్రజారంజకమైన రాజ్యపాలనచేసి, ధర్మసంస్థాపన గావించి, జనుల జీవితాలకు మార్గదర్శివై, ఆచంద్రతారార్కం కీర్తిచ్ఛటలు వెలార్చి పోసే మహిమాన్వితమైన రామాయణ మహాకావ్యానికి అధినాథుడవై పరమానంద ఆనందధామానికి దయచేసిన పరంధామా! జగన్నాటకసూత్రధారీ! ఆర్తజనరక్షకా! నిన్నే మని పొగడగలను? నిన్ను కీర్తించగా ఆదిశేషుని వేయి నాల్కలైనా చాలవు; నే నేపాటివాడను? జగదభిరామా! శ్రీరామ జపమే నా కత్యంత ప్రియమైనది. నీ నామ

రూపాన్ని నా హృదయంలో ప్రతిష్ఠించి, సర్వకాల సర్వావస్థలలోను శ్రీరామనామాన్ని నా నాలుకమీద నాట్యమాడేటట్లనుగ్రహించవలసిందిగా కోరుచున్నాను "

అని పరమశివుడు అనేక విధములుగ విష్ణువును కీర్తించగా శ్రీమహావిష్ణువు చిద్విలాసమూర్తియై చిరునవ్వు ముత్యాలు చిందిపడగ పరమశివుని తో ఈ విధముగా అనెను.

"పరమశివా! నాకు అత్యంత ఆప్తుడవైన నీవు, అజుడు, అమరులు అందరి తోడ్పాటువలననే నేను అసురుల్ని పరిమార్చి, లోకాలకు శాంతి సుఖాలు కలిగించాను. ఈ మహాకార్యంలో మనమందరము భాగస్థులమే! నీ కేమీ తెలియనట్లు నన్నే పొగడుచున్నావేమయ్యా! అసలు ముందుగా నేనే మిమ్ముల నభినందించాలి. నీ సహకారమే లేకపోతే నీ భక్తుడైన రావణుడు నాచేత నిగ్గింపబడేవాడా? పరమశివా! నీకిదే నా అభివందనములు " అన్న విష్ణుమూర్తి మాటలకు పరమశివుడు ఆనందంగా అంజలిఘటించి "శ్రీమన్నారాయణా! చిద్విలాసమూర్తి! నీముందు మేమెంతటి వారమయ్యా! నన్ను సృష్టించినది నీవే! నిన్ను సృష్టించుకున్నదీ నీవే! ఈ సృష్టి స్థితి లయముల కాధారభూతుడవైన నీకు మరియొకరి సహకారమెందుకు? అదంతా నీ నటనా చాతుర్యమేగాని వేరుగాదు. నీ అవతారములన్నిటిలో అతి పవిత్రము, అతిమనోహరము, ధర్మ శౌర్య ధైర్య సమన్విత

మైన రామావతారమే నా కత్యంత ప్రియమైనది. కాబట్టి రామకథను, రామనామాన్ని ఈ త్రిభువనాలలో స్థిరముగా నిల్చిఉండేటట్లు అనుగ్రహించవలసిందిగా కోరుచున్నాను" అన్న పరమశివుని మాటలకు విష్ణువు నగుమోముపై కెంజాయ అందగించగా అరవిందదళనేత్రాల వెన్నెల రేకలు జాలు వారగా "పరమశివా! నీ అభీష్టమే నెరవేరుతుంది. పాపు లను పునీతులుగ చేయుటకొరకే నేను రామావతారాన్ని దాల్చను.

శిష్టజనరక్షణము దుష్టశిక్షణంబు
నవని నొనరించుకొరకు నే నవతరించి
మత్కథా గంగాలహరి కామహీమ జనుల
పాప జంబాల మడఁగింతు పాలనయన!

ఈ విధంగా దుష్టుల్ని శిక్షించి ధర్మసంస్థాపన కొరకే నేను మానవజన్మమెత్తి భూమిమీద సంచరించి భూభా రాన్ని దీర్చాను. అందుకు రావణుడు నిమిత్తమాత్రం అయి నాడు. ఈ నా రామావతారకథ పవిత్రమైన రామాయణ మహాకావ్యంగా సకల భువనాలయందు ప్రసిద్ధినొంది ఆచంద్రతారార్కం నిలిచి, పాపుల పాపాల్ని బరిహరించి పరమపదమునందించే పరమపావన మంత్రంగా భాసిస్తుంది.

శ్రీరామాయణ ముఖ్యమామక కథాశ్రేణుల్ ప్రసం
గింపుచున్

బారిణత్వము మీరగా జనువుచున్ బాటించి యూలింపు
చున్
సారపజ్ఞరహింంచు మానవులకున్ షడ్వర్గమున్ దాకుంజే
కూరున్ కోరికలాటు ఘోరదురితౌఘ్నల్ మీరు నైశ్వ
ర్యమున్

అఖిల వేదంబుల పఠింపనగు ఫలంబు
నఖిలదానంబుల లొనరింపనగు ఫలంబు
నఖిలతీర్థంబులను గ్రుంకనగు ఫలంబు
నొదవు నిక్కథ నొక్కింత చదివినంత.

[ఉత్తర రామాయణం]

ఈ రామాయణ మహాకావ్యం చదివినా, వ్రాసినా, వినినా ఎటువంటి వారయినప్పటికి, ఎంత ఘోరపాపాలుచేసి నప్పటికి ఈ కావ్యపఠనంవల్ల వారు అతి పునీతులై అన్ని వేదాలు చదివినట్టి ఫలము, అన్ని దానాలుచేసినట్టి ఫలము, అన్ని పుణ్యతీర్థాలలోను స్నానమాడుటవల్ల కలిగే గొప్ప పుణ్యము కలిగి, నా కత్యంత ప్రేమపాత్రులై జనన మర ణాలులేని పరమపదం చేరుకుంటారు కాబట్టి ప్రతివారున్నూ స్త్రీ పురుష బాల వివక్షత, సమయా సమయములు లేకుండ ఎల్లవేళలా నీ మహాకావ్యం పఠనీయమైనది. ఓ పరమేశ్వరా! ఇంత పవిత్రమైనది, పరమపదాన్ని అందించే పవిత్రమైన కావ్యం మరేదిన్నీ లేదు.

ఎందాక జెలగు వేదము-లెందాకన్ దివి జరింతు రిందుండు
సూర్యుం
డెందాక గులగిరులు దగు నందాకన్ బొసగునిమ్మహా
కావ్యమిలన్.

సూర్యచంద్రులు, గిరులు, తరులు, వేదము లున్నంత వరకు ఈ కావ్యం ఇలమీద నిల్చేఉంటుంది. దీని పవిత్రత చెక్కుచెదరదు. అనగా సృష్టి ఉన్నంతవరకు ఈ రామాయణ మహాకావ్యంగూడ కల్పవృక్షమై దానినీడను చేరు వారికి సకల అభీష్టములు తీర్చి కొంగుబంగారమై నిలిచి ఉంటుంది. ఈ రామాయణ కావ్యం పఠించటమేకాదు, ఒక్కమారు 'రామా' యని నామాన్ని మనసారా ఉచ్చరించినా చాలు; అట్టివారు పరమ పవిత్రులగునట్లుగా వరం బొసంగుచున్నాను"

అని పరమశివునితో సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే రామకథా పఠన శ్రవణము పవిత్రత గూర్చి 'రామ' నామోచ్చరణ మహిమను గూర్చి చెప్పినప్పుడు ఇంక రామ నామ మహాత్మ్యాన్ని గూర్చి కొనియాడుటకున్నూ, చెప్పుటకున్నూ మానవమాత్రులకు శక్యమా ?

అపార మధురము, ఆనంద రసధుని, నిసర్గసౌందర్యము తులలేని పవిత్రత నిబిడీకృతమైన రామాయణ మహాకావ్యం ప్రతి మానవుడు జీవితంలో ఒక్కసారయినను పఠిం

చినవారి జన్మ ధన్యమగును. కానీ జీవనకార్యభారంలో మునిగి, సమస్యల వలయాలలో చుట్టుకుపోయి, డస్సిపోయెడి మానవాళికి పవిత్రమైన కావ్యాల పఠనమునకు భగవన్నామ స్మరణకు తీరికలేక తినుట త్రాగుట కొరకు, సంపాదించుటకై జీవితాన్ని కాలాన్ని వినియోగించి, అదే 'జీవనధర్మం' అనుకుంటారు. అట్టివారు తరించే సులభమయిన మార్గం 'రామ' నామస్మరణ మొక్కటియే తినుచున్నను, త్రాగుచున్నను, నిదురించిన, మేల్కొనిన ఎటువంటి సమయముల నయినను 'రామ' నామాన్ని స్మరించవచ్చును. ఇందుకు ఏవిధమైన శ్రమ దమాలు లేవు. కావలసిందల్లా సీతారాములయందు నమ్మిక భక్తి మాత్రమే! అట్టి భక్తి జ్ఞాన సంపన్నులైన మానవుల పట్ల వాయునందను డపారమైన ప్రేమ కరుణ చూపి రాముని పదపద్మాలయందు చేర్చును.

రాముని చరణసన్నిధికి చేరుటకు వాయునందనుడే మార్గము. వాయునందనుని ప్రేమకు పాత్రులు కావలెనన్న రామస్మరణమే సులభోపాయము. కాబట్టి ఇష్టముగనో, ఇష్టములేకనో ఏదోవిధంగా రామనామాన్ని జపించుట ఒక్కటియే కలియుగములో మానవులు తరించు మార్గము. యోగీంద్రులు, మహామునులు, తపశ్శాలురు, జ్ఞానసంపన్నులు. భక్తితత్పరులు ఎవరు ఏవిధంగా చెప్పినను భగవంతుని చేరగలిగే మార్గం ఇదొక్కటియే! వేరుమార్గం లేనే

లేదు ! ఇది చరిత్రచరణమే కావచ్చు కాని చరిత్రచర్వ ణము అగుకోలది 'రామ' నామము మనస్సును ఆనంద తుందిలంచేసి, హృదయాన్ని అమృతరసధుని కావిస్తుంది. ఇది ఎవరికి వారు ఆచరించి తెల్సుకోవలసిన అమూల్యమైన మధురానుభవం. ఈ అనుభవం పొందుటకొరకే ప్రతి వారున్ను ప్రయత్నంచేసి జానకీజాని కరుణకు పాత్రులు కావలెను.

జీవితం క్షణభంగుర మయినది. కాలం అమూల్యమైనది, వ్యర్థంగా చేజారిన క్షణం ఎన్నటికి తిరిగి రానేరదు. క్రిమి కీటకాదులకన్న, జంతుజాలంకన్న మానవజన్మ ఉత్తమోత్త మయినట్టిది అట్టి ఉత్కృష్టమైన మానవజన్మ వృధా కాల యాపనతో, ధనకాంక్షతో పాపాలుచేసి పుట్టుచు చచ్చుచు మరల మరల పాపాలు చేయుచు వ్యర్థపుచ్చకుండా భగవం తునియందు దృష్టినిలిపి, భగవన్నామమును నిరంతరము జపించుచు, నిర్మలమనస్కులై జీవనకర్తవ్యాన్ని నిర్వహిం చుచు, భక్తితో భగవంతుని సేవించుచు పవిత్రమయిన జీవితాన్ని గడిపేవారిపట్ల అనురక్తుడై అట్టివారిని ప్రేమతో చేరదీసి పరమపద ఆనందధామాన్ని అందిస్తాడు. భగవంతుని కరుణనుపొంది జనన మరణాలు లేని పరమపదాన్ని అందు కొనుటకై భక్తియుతము, నియమబద్ధమైన జీవితాన్ని గడిపే వారే ధన్యజీవులు; వారిదే సార్థకమయిన మానవజన్మ.

పరమ పావనమయిన 'రామ' నామాన్ని రోజులో కొన్ని నిముషములైనా జపించినట్టివారి పుణ్యమే పుణ్యము.

జీవితమనే మహానదిలో సమస్యల సుడిగుండాలు, కామ క్రోధాల జలచరాలు, దురాశ, దురహంకారపు కెరటాలు ఎగసిపడి మానవుని ముందుకు పయనింపకుండా ఉక్కిరిబిక్కిరి చేసి ముంచివేసి తానెటు పోతున్నాడో! తనకే తెలియని దుస్థితిలో పడవేస్తాయి. అజ్ఞానమనే గాఢాంధకారం అలుముకున్న మనస్సులో కోరికలు ధనకాంక్షా సుఖలాలసత లనే తటిల్లతలు మిరుమిట్లు గొల్పుతూ కళ్ళు మూసుకుపోయి, అపమార్గాల్లో చరించి పతనమయి జీవితపు సుడిగుండాల్లో మునిగి ఆట్టడుక్కి పోయి, పాపాల కూపంలో పడిపోతారు. ఇటువంటి మహాప్రమాదంలో పడకుండా ఈ ఆటంకాల నధిగమించి భగవంతుని వేపు పయనించటానికి భక్తియే మార్గము. ఈ భక్తిని ఆధారంగా చేసుకున్నప్పుడు మానవ జీవితమే భక్తిరస బిందువుగా మారి అల్లనల్లన పయినించి ఉత్తుంగతరంగాలతో తృళ్ళిపడి పరువెత్తి చివరకు గమ్యం చేరుకుని అమృతరఝరీ కెరటాల్ని ఎగజిమ్మే భగవానుని హృదయసింధువులో కలుస్తుంది. ఇందుకు 'రామ' నామమే సహకారి, ఈ "రామ" నామ సహాయంతో ప్రతివారు జీవనస్రవంతిలో సుగమంగా పయనించి భగవాన్నుణ్ణి అందుకోవాలి. అదే మానవ జన్మనెత్తిన జీవుల లక్ష్యము!

భగవంతుడు ఉన్నాడా - లేడా? అనేది శుష్కమయిన వివాదం. ఈ సకల చరాచర జగత్తును నడిపించే ఓ మహాశక్తి ఉన్నదనీ అదే సకల జీవులకు ప్రాణాధారమని ఎంతటి నాస్తికులుకూడ కొన్ని సందర్భాలలో ఒప్పుకుంటునే ఉంటారు. అపూర్వము, మహిమాన్వితమయిన ఆ అదృశ్య శక్తిని నమ్మి భజించే వారికి భగవానుడు సర్వదా రక్షణగా ఉంటాడు. వారెటువంటి కష్టాలు భరించినా చివరలో సుఖాన్నే అనుభవించి దేవదేవుని పాదపద్మాలు చేరుకుంటారు. వారి జీవితాలు ఈ భూమిమీద చిరస్థాయిగా నిల్చిపోయి ప్రఖ్యాతి పొందుతాయి. అందుకు త్యాగరాజు, రామదాసు, మీరాబాయి మొదలైన భక్తవరేణ్యుల పవిత్రమయిన జీవితగాథలే మనకు తార్కాణం!

కాబట్టి భగవంతుణ్ణి మనసా వాచా నమ్మి భజించే వారు పూర్వజన్మ సుకృతంతో పుట్టిన పుణ్యవంతులు. అట్టి పుణ్యవంతులే రామాయణ మహాకావ్యాన్ని పఠించుచు రామనామాన్ని జపించుచు భగవంతుని కథలను వినుచు భక్తియుత వినిర్మలమయిన జీవితాన్ని గడిపి ముక్తినొందెదరు. అదియే యెల్లరకున్నూ జీవితాదర్శము.

రామారామా రామచంద్రా
రక్షమాం శ్రీరామచంద్రా

శక్తినొసగే మంత్రరాజం
భవభంజనం రామనామం
మారుతాత్మజ సేవితంబగు
మహిమగల శ్రీరామ మంత్రం
సత్యమైనది రామనామం
నిత్యమైనది రామనామం
రామనామము చేయువారిని
రక్షించు నిజముగ జానకీపతి.

ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః
లోకాసమస్తా సుఖినోభవంతు !

శ్రీరామనామ సుధానిధి సమాప్తము.



ఉల్లంఘస్య సింధోస్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః
ఆదాయతేనైవ దదాహలంకాం
నవామి తం ప్రాంజలి రాంజనేయమ్ ॥

# నాలో రాముడు - నీలో దేవుడు

పరమపావనుడైనట్టి భద్రరాము
నామ జపమును సలిపెడు నరులకొరకు
వచ్చి నిలుచును పుష్పక వాహనమ్ము
చేరవచ్చును కైవల్య సీమకెలమి

కొండకోనల వెన్నెల కొలనులోన
పూచి వికసించు చెంగల్వపూల ప్రాలు
మత్తభృంగమ్ము కోరి రామాయణమున
సుందరాకాండ పఠియించు సొంపుమీర

ఇచట ఇలలోన తణుకున వెలుగు గుండె
ఒక్కటి కదలి గంతిడి చిక్కనైన
భక్తిభావమ్ముతోడుతో పరగప్రాసె
అట్టి సుందరాకాండను ఆర్ద్రవృత్తి

రామచంద్రుని స్మరియించి రమ్యమైన
భావ బలమును పొందియు భవ్యవృత్తి
చేదుకొనవచ్చు పున్నెంపు సీమలోని
కోమలానంద ఘటుతులు కోరికోరి

సుఖముల నొసంగు దాత యా రఘువరుండు
స్నిగ్ధచిత్తమ్ము నొసగును సీతతల్లి
లక్ష్యసిద్ధిని కల్పించు లక్ష్మణుండు
భక్తిసంపద వెలయించు పవనసుతుడు.

రాపూరి వేంకట సత్యనారాయణరావు
అధ్యక్షులు
భాషాకుటీరము, హైదరాబాదు.



శ్రీరామ

# సుందరము

శ్రీకరంబుగ వ్రాసెద చిత్తమలర
సుందరాకాండ గాధను సొగసుగాను
జానకీరామచంద్రుల శరణువేడి
పవనసూనుని పలుమారు ప్రస్థుతింతు. 1

తరుణి జానకి కనరాక తపనజెంది
పడతి కొరకెంతొ మదిలోన బాధనొందు
రామచంద్రుని దరిచేరి లక్ష్మణుండు
"అన్నదిగులొంద నేటికి యతివకొరకు
వెదుకగా వానరేంద్రులు వెడలునయ్య" 2

అనుచు పలికెడి తమ్ముని యట్లెజూచి
కనులచిందెడు కన్నీరు కాల్వలగుచు
ఆంజనేయుని దరిజేర్చి ఆదరమున
అంగుళీయక మిచ్చుచు ననియె విభుడు 3

'వత్స ! వానరోత్తమ నీవు త్వరగపొమ్ము
అక్షయంబైన బలమోయి హనుమనీది
దిక్కుదిక్కుల గాలించి దీక్షతోడ
జానకీదేవి వెదకియు జాడతెమ్ము' 4

ఆ రఘూత్తము మాటల నాలకించి
స్వామి ధన్యుడనేనని సాగిలపడి
మ్రొక్కి బలము శౌర్యంబులు మోపుగాగ
చేరె వారిధి వానరుల్ చెంతనుండ 5

హనుమ అంత మహేంద్రమునందు నిలచి
ఎటులవారధి దాటువో ఏమిసేతు
ననుచు దిగులొందుచుండెడు నంతలోన
వానరేంద్రులు పలికిరి వానితోడ 6

"అన్న ! జాగుచేసెదవేల ఆంజనేయ
నీకుగాకున్న యీశక్తి నెవరికుండె
రామముద్రిక నీకిచ్చు రక్షణంబు
జవమునను నీవు లంకకు జనుము యిపుడె 7

పుడమిపుత్రిక జాడలు బొంచిజూచి
నీవు వచ్చెడునందాక నేము ఇచట
నిలచియుండెద మికవెళ్ళు నీకు శుభము
కలుగు సందియమువలదు గాడ్పుసుతుడ !" 8

వారిమాటలు విన్నట్టి వాయుసూను
భయమునంతను మదినుండి పారదోలి
భుజముతట్టుచు శక్తిని పుంజుకొనుచు
తనువుపొంగగ ఎగసె ఉదధినిదాట 9

ఆకసంబున కెగసిన హనుమనరసి
దేవదుంధుబులు మ్రోగె దిక్కులదర
ఆనగంబున విరిమానులన్నియపుడు
పూలజల్లులు కురిపించె పొలుపుమీర 10

హనుమకాతిథ్యమివ్వగా యబ్ధితలచి
తనలోదాగున్న మయినాంకు తక్షణమున
పయికిపంపించి చూపెను పవనసూను
మారుతాత్మజు డాతడు మనకునతిథి 11

కడలి యాజ్ఞనుగొని మేనకాసుతుండు
ఆంజనేయున కెదురేగి యంజలించి
తళుకుబంగరు శిఖరాన తడవుకొంత
విశ్రమింపగ రమ్మని వినతిచేసె 12

మనసుఅలరగ మైన్నాంకు మాటలకును
మంచిమాటలు చాలవే యెంచిచూడ
సంతసించితి తడవిట జాగుతగదు
మరలివచ్చెద నాతిథ్య మందుకొనగ 13

అనుచు మయినాంకు వీడ్కొని యనిలసుతుడు
వేగ సాగెను ఆ వినువీధిలోన
అతని దర్పము వీక్షించి యమరులపుడు
సురస నంపిరి వానిని శోధచేయ 14

అక్కజంబుగ ఆ యమరక్కసయ్యె
ఇంతలింతలు కోరలు అంతనోరు
బారచాచుచు వచ్చియు భయము గొలుప
వాయుసుతునకు ఎదురుగబలిమి నిలచె 15

అడ్డునిలచిన రక్కసి నరసిచూచి
గుండెచెదరక మార్కొనె కోపగించి
అంతులేకుండ వక్త్రము యామెపెంచ
తానుపెంచెను కాయమ్ము తడవులేక 16

ఆమడామడ పెరిగెను యామెనోరు
అంజనాత్మజుడది చూచి యదరిపోక
సూక్ష్మరూపము దాలిచి సురసనోట
పడియు పరుగున వెలికొచ్చె పవనసుతుడు 17

సురస సుందరియయ్యెను సొగసుగాను
రామకార్యము నెరవేర్చి రమ్మటంచు
అలుపులేకుండ వరమిచ్చె యతనికామె
అమరులందరు మెచ్చిరి హనుమనపుడు 18

బలము శౌర్యము రూపుగా పావనుండు
పవన వేగానసాగె అంబరమునందు
బలముతరిగెను మారుతి భయమునొంది
అంత జూచెను యిదియేమి వింతయనుచు 19

సింధువందున రాక్షసి సింహికపుడు
వాయునందను నీడను బలిమిపట్టి
లాగివేయుచునుండెను లాఘవముగ
క్రోధపూర్ణితనేత్రుడై రోషమునను 20

ఇంత కావరమది దీనికెంతకలదొ !
నీలచేసెదనిక దీని నిపుడెయంచు
దడుపులేకుండ దాని వక్త్రింబునందు
ఆగ్రహంబున దూకెనా యనిలజుండు 21

పొట్టప్రేగులు చీల్చియు పొంగివచ్చి
సింహనాదముచేసెను సింహబలుడు
అంత రక్తముగ్రక్కుచు నదియుచచ్చె
సింహికను జంప దేవతల్ చిత్రమంది
పూలవానలు గురిపించె పులకరించ 22

అంతకంతకు వుత్సాహమతిశయిల్ల
పారవారము గడిచిన పావనుండు
ప్రొద్దువాలెడు సమయాన సద్దులేక
లంకదాపున దుమికెను లక్షణముగ 23

నిట్టనిలువుగ నిలచియు నింగినంటు
కోటగోడల వీక్షించి కోతిరేడు
జాగరూకత భటులుండు జాడతెలిసి
యిందుజొచ్చుట క్షేమము యిపుడుకాదు 24

అంచు మదిలోన తలపోసి యనిలసుతుడు
పూలవాటికలందున ప్రొద్దుపుచ్చె
జాముగడచెను చీకటుల్ జాలనయ్యె
సద్దుమణిగెను వేళాయె నిద్దురలకు 25

దివినివేలాడు మాణిక్యదివ్వెవోలె
లక్షదీపాల కాంతిలో లంకవెలిగె
మెరసిపోయెడి నాలంక మిడిసిపాటు
నక్కజంబుగ గాంచెను అగచరమ్ము 26

అందమెగజిమ్ము అచ్చర చందమునను
వింతకాంతుల నాలంకవైపుకంత
అల్లనల్లన అడుగిడె యనిలజుండు
అంతనతనికి ఎదురయ్యె నబలయొకతె 27

ఎచటనుండియొ వచ్చితివిచటికీవు ?
ఎవరి యాజ్ఞతో లంకకు నేగుచుంటి ?
నిలువునిలుమంచు హనుమను నిలువరించె
అబలకాదిది బాపురే యనగనామె ! 28

సౌపలీనెడు అపరంజి సౌధములతొ
వాసికెక్కిన సుమరాసి వాటికలతొ
సుందరంబగు నీలంక చూడవ స్త్రీ
నేల యిటనుంటివో లేమ యెవరునీవు 29

భక్ష్యమని నవ్వెమారుతి పలుకులకును
నన్నెవరని యనుటయు నగవుగాదె
లంకగాచెడి దానను లంఖిణింద్రు
మాటలిక చాలు వేగమె మరలిపొమ్ము 30

ఆమెమాటలు త్రూలించి ఆంజనేయు
డంత లోన్నిబ్బోవ యామె అపుడు
బిట్టుపెల్లార్చె అడ్డమై భీకరముగ
తామసించెను హనుమన్న తరుణియనుచు 31

అతని జాప్యము లంఖిణి యలుసుచేసి
'అనిని గెలుచుట నన్ను నీ యబ్బతరమె !
కూలదోచెద నిన్నింక కోతిగాడ'
అనుచు అరచేత చరచెను యనిలసుతుని 32

ఆమె దెబ్బకు యెంతయో నాగ్రహించి
ఈమెశక్తిని చూసెద నేనుయిపుడె
వామహస్తము బిగియించి వాయుసూను
లంఖిణిని వేసె తనచేతి లావుజూప 33

ఒక్కదెబ్బకె రుధిరము గ్రక్కుకొనుచు
ధరణి గూలుచు మిక్కిలి దడిసిపోయి
వేడుకొందును యిక నన్నువీడి చనుము
యింక నీకును జయమేను లంకలోన 34

ఇన్నిదినముల దాదిగా నన్నుగెలుచు
వీరుడొక్కడు రాలేదు విక్రమించి
దనుజ జాతికి అంతము దాపురించె
నన్నుగెలిచిన వీరుడా నతులు నీకు !' 35

ఆవిధంబుగ లంఖిణి నణచివేసి
లంకలోనికి బోయెను లాతరించి
పసిడి కాంతులు జిలుగుల ప్రాభవముతొ
ఆకసంబున నంటెడు హర్మ్యములను
అబ్బురంబుగ జూచెను హనుమయ్యపుడు 36

అన్ని సౌధమ్ములందున అందమునను
రావణేంద్రుని సౌధమ్ము రాణకెక్క
వింతవింతల సొగసుల వీధులమరె
పాకశాసను వీటిగా భ్రమనుగొలుపు 37

రాజ సౌధమునందున రాజభటులు
అప్రమత్తత నుండిరి యంతటంత
నేర్పుమీరగ వారల నేమరించ
సూక్ష్మదేహము దాలిచె సూక్ష్మనేత్రు 38

మారుతాత్మజుడంతటా మహలుజొచ్చి
పొంగిపొరలెడు సిరులకు ముదమునంది
తానువచ్చిన కార్యము తడవుమరచి
మహలు అందము పొగిడెను మళ్ళిమళ్ళి 39

కొంత సేపాయె తెలివొంది కోతిఘనుడు
జనకపుత్రిని వెదుకగా జాగుచేయు
తెలివిలేమికి తానుగా తిట్టుకొనుచు
పట్టుదలమీర తిరిగె నా భవనమందు 40

రావణాభ్యంతరంబు నారాత్రివేళ
సుప్తగాఢత నుండిరి సుదతులంత
అవనిజాత్మజ కొరకు నాయబలలందు
నరయసాగెను ఆత్రాన ఆంజనేయు 41

నిదుర తూగెడువారల నిస్తరించి
మందిరంబున గదులన్ని మరలమరల
పట్టుదలమీర గాలించె భయములేక
రామపత్నిని కనడాయె రామదూత 42

చీరె సరిలేక నిదురించు చేడెయొకతె
తారహారముల్ తెగినట్టి తరుణియొకతె
కంకణంబులు పగిలిన కాంతయొకతె
అంగరాగము చెదరిన అంగనొకతె 43

పక్కనున్నట్టి మద్దెల పతియెనంచు
కౌగలించుకు నుండెనో కమలనేత్రి
నాట్యఖేలన మొనరించు నాట్యకత్తె
హస్తముద్రతో నిదురించె నలసిసొలసి 44

చెమ్మటలనోగి పడియుండె చెలియయోర్తు
తప్పత్రాగిన మత్తునో తలియబోడి
సొంత నిదురించు చేడియ చెరగులాగి
తనదె యని ముసుగిడె నొక తక్కులాడి 45

ప్రేమమీరగ తనచెలే ప్రియుడటంచు
చుంబనం బొనరించెనో సుందరాంగి
ఒకరిమీదను ఒకరుగా ఒరిగిపోయి
సురతకోరెడి రీతిలో సుదతులొకచో 46

ఎవరి దేహము ఎవరిదో యెరుగనటుల
ఆటపాటల నెంతయో అలసిసొలసి
పడుగుపేకల రీతిని పడతులంద
రడ్డదిడ్డాల పవళించ హనుమ చూచె 47

చారుతర చంద్రచంద్రికా చంద్రముఖులు
పద్మరేకుల నేత్రాల పడతులొకచో
మెరిసిపోయెడు మేనుల మెలతలొకచో
సరస విన్నాణమున జాలుసతులజూచె 48

ఎన్నిరీతుల నున్నారొ నెన్నలేని
అంగనామణులుండె నాహర్మ్యమందు
రావణేశుని సఖియలే రామలంత
భూమిపుత్రిక లేదు ఆముగుదలందు 49

వెతకివెతకియు కనరాక వింతనొంది
ముందుముందున కేగగా మోహనముగ
పసిడిగోడల మిసిమించు భవ్యకాంతి
పరిమళంబుల నెగజిమ్మ పరవశింప
చక్కనయినట్టి నొక దివ్యస్థలముగాంచె 50

మంచిముత్యాల సరులతో మణులుపొదిగి
విరులకూర్చిన మాలలు వ్రేలుచుండ
పట్టుపరుపులు సొంపుగా పరచియున్న
మనసు రంజించు నపరంజి మంచమొకటి 51

అంమజూచెను విభ్రమ మందగాను
నిడుద యింతని చెప్పగా నెన్నలేని
కారుకాటుక కొండగా కాయమొప్ప
మంచమందున నిదురించె మత్తు నొకడు 52

ఎర్ర సరిగంచు వలువలు ఎలమిగట్టి
పరిమళించెడు గంధాలు పంతమాడ
విద్రుమంబుల హారాలు విరులసరులు
మేలి రత్నాలమాలలు మెడనువ్రేల 53

కెంపుపొడులున్న కంకణాల్ కేలమెరియ
కనులమెరిపించు కేయూర కాంతితోడ
వింతజిలుగుల కుండలాల్ వీనులందు
రాజసంబును వేలార్చు తేజమలర 54

పగతుడెంతటివాడైన బలిమిగొట్టి
జమునివాటికి నంపగా జాలినట్టి
కండబలముకు దీటైన గుండెబలము
మెండుగానున్న మగటిమి మెచ్చునటుల 55

కోరి జంభారి నయినను గూల్చుననిలో
శౌర్యమరయంగ నీతని సాటిలేరు
చూచినంతనె చెప్పగా చోద్యమనగ
మదపుటేనుగు భాతినా మదికిదోచు 56

గుండెతడిలేక కర్కోటకుండె యనగ
శౌర్యమేకాదు పచ్చికసాయివాడె
అనుచు భయమందచేసెడి నతని జూచి
దనుజభూపతి వీడని తలచె హనుమ 57

వాని కిరుపార్శ్వమందున పరువమొప్ప
నిదురబోవుచు నెందరో నెలతలుండె
కూర్మిమీరగ వారితో కూడికేళి
అలసిమత్తున పడియున్న యతనిజూచి 59

బుద్ధిహీనత కలిగిన పొగరెనీకు
చేటు తెచ్చెను ఇంకెన్నొ చిక్కులొదము
పడతి జానకి కోరిన పాపివీవు
రామబాణము నిను కూల్చు రావణేంద్ర 59

కినిసి శపియించి రావణున్ కేసరుండు
అందు నిదురించు అంగనలందు కూడ
జనకసుత బోలు నెవ్వరు కానరాక
మనసు దిగులొంద కదిలెను మరలవెతుక 60

అంతిపురమందు మరియొక యంకణాన
మేలిజలతారు పరదాలు మిసిమివ్రేల
జిలుగు సొగసుల బంగారు గొలుసులమర
చక్కగానుండె డోలిక సరసరీతి 61

తూగుటుయ్యాల అలవోక తూగుచుండ
ముద్దులొలికెడి స్నిగ్ధమౌ ముద్దరాలు
శుభగమోహన తారుణ్య శోభతోడ
అందమయినట్టి డోలికయందు జేరి
అత్తమిల్లెను విరులున్న మెత్తమీద 62

ఆమె విభవంబు నెంచగా యలవిగాదు
ఆమె జహ్వారి వెలగట్ట నలవిగాదు
ఆమె అందాలు సరిపోల్చ యలవికాదు
ఆమె పతిభక్తి నెంచగా నలవికాదు 63

మెలత లందరిలో నామె మేలుబంతి
స్నిగ్ధ సుకుమార మాధురీస్నేహ హృదయి
ప్రేమచెలువారు రమణీయ ప్రేయశామె
రావణేంద్రుని పట్టపురాణి ఆమె 64

హనుమ చూచెను ఆమెను అబ్బురాన
ముద్దుమోమున నైర్మల్యముట్టిపడగ
నిండుచంద్రుని హసియించు నిర్మలాంగి
పుడమికన్యక నామెగా ముదమునంది 65

మనసునిండిన హర్షాన మారుతుండు
నేను గాంచితి జానకి నేటికనుచు
తోకముద్దిడి ఛంగున దుమికిఎగిరి
అంతలోపల శంకేదొ యతనికొదమె 66

ఈమె జానకి యనుటకు ఎటులపొసగు
పతిని ఎడబాసి దిగులొందు పడతియిటుల
విభవముల చాల తులతూగి వేడుకలర
చింతలేకను నిదురించ వింతయేను ! 67

అవనిజాత్మను గానక అడవులందు
దీనదశతోడ రాముడు తిరిగితిరిగి
అన్ననీరంబులానక యడలుచుండ
రాణిభోగంబు నుండునే రామదయిత 68

కోరి సుఖములనందు యీ కోమలాంగి
మయుని పుత్రి మండోదరీ మహిళ యనగ
రావణాసురు పట్టపురాణె యగును
అవనికన్యక కాదు యీ యతివచూడ 69

అంతనాతని ఉత్సాహమణగిపోయి
చిన్నబోయిన మోముతో చింతనొంది
మహాలునందేది వదలక మరలమరల
గదులుగదులన్ని గాలించె గాలిబిడ్డ 70

రాజభవనంబు వారికి రంజితముగ
తీరుతీరుగ రుచులెన్నొ నోరులూర
భక్ష్యభోజ్యము లెన్నియో బహుళముగను
పచనమొనరించు సువ్వార పట్టుగాంచె 71

మేలి పసువుల మాంసమ్ము మేళవించి
రకరకంబుల వండిరి రాజుమెచ్చ
పాత్రలన్నియు నిండుగా పచనమయిన
వ్యంజనంబులు విందుకు అమరియుండె 72

ఆరగింపులు చేసెడి యంకణాన
మణుల దీపాలు వెలిగెడి మందిరమున
వన్నెచిన్నెల బంగారు గిన్నెలందు
పలురకంబుల భోగాలు భద్రపరచె 73

మనసు తీరగ త్రాగించి మత్తుగొలుప
రజత భాండములందున రమ్యమైన
ఆసవంబులు నిండుగా పోసియుండె
అందు జొచ్చిన వారల డెందమలర 74

త్రాగి విసరిన గిన్నెలు ధరణిదొరల
సగము రుచిచూసి వదలిరి సరసగతిని
తనివితీరగ తిన్నట్టి తాంబళములు
భోక్తలభిరుచి తెలుపునా భోగముండె 75

పీకమొయ్యల తినిత్రాగి పిక్కటిల్ల
మత్తుమీరగ నట కొంతమందియుండె
అవనిపట్టిని గానక యనిలుపట్టి
దిక్కుతోచక దుఃఖించె దిగులుచెంది 76

యెందు వెదకిన కనరాదు యిందువదన
యేమిసేయుదు నేనింక యెచటజూతు
మనసు నిలువక ఆత్రాన మరలమరల
వెతికి వెతికియు మారుతి వెలికివచ్చె 77

పూలవాటికలందున పొదలలోన
కువలయమ్ములు విరిసిన కొలనులందు
వెలుగు వెన్నెలజాడల వెంటనడిచి
సీతచిన్నెలు కానరాకచింతనొందె 78

"రామపత్నిని చూడక రాముకడకు
మరలిపోవుట ఎటులనా మనసుకొప్పు
అంగదాదులు ననుచూచి యపహసింప
యింక శౌర్యము ధైర్యము యేలనాకు ! 79

లంకలోపల జానకీ లలనలేదు
యనెడు మాటల కోర్చునే యతివవిభుడు
గుండెలవియగ నేడ్చుచు కూలిపోవ
అంత సౌమిత్రి అన్ననే యనుసరించు 80

తనదు ఆజ్ఞను మీరిన తప్పునరసి
కినిసి కోపించి దూషించి కించపడగ
వాలి అనుజుడు వధియించి వానరులను
తాను మడియును చింతతో తడవులేక 81

యెందరెందరో వానరుల్ యిటనుయుండ
కార్యసాధన మొనరించు ఘనుడటంచు
తననె బంపిరి జానకి తరుణినరయ
చేసె తానింత కీశులు సిగ్గుపడగ 82

ఏవిధంబుగ జూచిన యిపుడు నేను
మరలివెళ్ళుట యెవరికి మంచికాదు
కానవలెనేను జానకీకాంత నిచట
కానకుండిన పోవుటే మానవలెను 83

ఏదిఏమైన కానిమ్ము ఇందెయుండి
అవనిజాత్మజ పొలకువ నరయవలయు
పొలతి యెందును కనరాకపోయెనేని
ప్రాణములనేని వదలెద ప్రభునివలచి 84

రామపత్నిని యెటదాచె రావణుండు
అంతగాలించి యీలంక యంతుజూతు
పొగరుమీరిన రావణున్ పోరుకీడ్చి
బలిమి చెప్పించకున్న నే పావనుడనే ! 85

జనకసుత జాడ రావణుచప్పడేని
దనుజు తెగటార్చి జలధిలో ద్రించివేతు
వాని పరివారమంతయు వానివెంట
మహిషవాహను దరికేగు మహినివీడి" 86

ఇనుమడించిన క్రోధాన అనిలజుండు
వేడి యూర్పుల గాలులు వెడలుచుండ
దనుజ[illegible]రునిబట్టగా దారికొరకు
నె[illegible]కసాగెను అంతలో[illegible] వెపముదోచె 87

"వీరపూజ్యుడు రాముడు విక్రమించి
ఆలమందున రావణున్ హతునిజేయ
పగనుగొనియుండ దనుజునిబట్టి నేను
ఎటుల జంపుదు చూడగా ఏమితెస్స ? 88

పుడమిపట్టిని చెరబట్టె పొలసుదిండి
అతని గూల్చుట రాముకే ఔను యశము
యింక రావణు ౹మందింప నేలనాకు"
అంచు తలపోసి తలయూచి హనునుయపుడు 89

పుష్పకంబున పైకెక్కి పొగులుచెంది
చింతచేతను తోచక చేష్టదక్కి
కనులజారెడు కన్నీట కపివరుండు
అబ్ధి లంఘించి వచ్చిన లబ్ధియేమి ? 90

అనుచు పలుమారు మదినెంచి యలమటించి
దిగులుచెందుచు వీక్షించె దిక్కులన్ని
అంత కననయ్యె దూరాన అబ్బురముగ
అంబరంబున నంటు ద్రుమంబులెన్నొ 91

రమ్యమయినట్టి ఆ ద్రుమారామమందు
వెదుకలేదన్న వూహలు మదిని గలిగె
అందు జూచెదగాకంచు ముందుకురికి
సంతసంబున హనుమడు సాగెనటకు 92

కేలుమోడ్చియు మ్రొక్కెనా కేసరుండు
సకల దేవతలకునెల్ల చాలభక్తి
జనక కన్యను గాంచెడి జాడకొరకు
వరములిచ్చియు గావగావలయునంచు 93

ఇనకులేశుని భక్తితో యెదను తలచి
ఉపవనంబున జానకి యుండుననుచు
నింగితాకెడు వృక్షమ్ము నెక్కిచూడ
మదిని నమ్మిక కలిగెనా మారుతునకు 94

అంత ఎదలోన ఉత్సాహమతిశయిల్ల
తోక జాడించి ఛెంగున దుమికి దుమికి
ఒక్కటొక్కటె ద్రుమములు ఎక్కివెడలి
ఆవనంబున దాపున హనుమనిలచె 95

హనుమవెళ్ళెడి దారిలో అండజములు
కాకళీస్వనంబుల చేసె కలరవంబు
మధువుచిందెడి విరులున్న ద్రుమానులన్ని
పూలజల్లులు కురిపించె పొలుపుగాను 96

పూలు నిండిన తనువు పుష్పాదులు జిమ్మ
కోమలమ్మైన సుమరాసి కొమ్మవోలె
పరిమళంబుల నెగజిమ్మ పావనుండు
సుందరంబుగ భాసించె చోద్యమనగ 97

దాపునున్నట్టి శింశుపాతరువు నెక్కి
పారజూచెను ఆవన ప్రాభవంబు
ఒత్తుగా విరిసిన విరిగుత్తులెన్నొ
హనుమ నలరించు సొగసుతో హాయిగొలిపె 98

మధురసంబుల ఫలముల ద్రుమానులెన్నొ
కనులకింపైన కొలకుల కలువలెన్నొ
పొందుగానున్న తీవెల పొదలలెన్నొ
వింతవింతల నుండెను ఎంతగానొ 99

అందమెగబోయు అరాము చందమంత
వెలుగు వెన్నెల జాలులో వెలిగిపోవ
అరసి యరసియు హనుమన్న హర్షమంది
యిందుతప్పక గాంచెద యిందుముఖిని 100

మనసునందలి కోరిక ననలుసాగి
అంతరంగాన యోచించు నంతలోన
తనకు దాపునె శింశుపాతరువు నీడ
తరుణి యొార్తుక కననయ్యె తపసివోలె 101

ఆమెనట గాంచినంతనే హనుమ మనసు
పొంగిపోయెను తనువెల్ల పులకరించె
అంత మదినేదొ సందియమందసాగె
ఈమె జానకియేయని ఎటుల తలతు ? 102

ఆమెచుట్టును రక్కసి యాడవాండ్రు
చేరియుండిరి ఏదియో చెప్పదొడగె
అంత విననయ్యె దవ్వుల అలజడేవొ
కంచు కాగడాలు వెలుగు కాంతివచ్చె 103

పట్టుజేగురు వస్త్రాలు దట్టిగట్టి
మేలిరత్నాల హారాలు మెడనుదాల్చి
పలురకంబుల గంధాలు పరిమళించ
అపర మన్మధమూర్తినా ననగనొప్ప 104

ఇతని భోగాల సాటికి యితడె యనగ
ఎంచి చెప్పగలేనట్టి మించు సిరుల
మేలిరతనాల నిధులున్న మేరువనగ
కదలివచ్చెడు రావణున్ గాంచె కేశు 105

జిలుగుహారాలు మెడలోన చిక్కుపడగ
పూలసరులన్ని జడనుండి రాలిపోవ
నిదురచాలని అరుణాక్ష నేత్రములతొ
రమణు లెందరొ వెంటరా రావణుండు 106

వెడద కన్నులు కోర్కెతో వెలిగిపోవ
మదనతాపంబు నోర్వక మత్తుతోడ
త త్తరంబున అడుగులు తడబడంగ
తరువు నీడలనున్న యా తరుణిజేరె 107

ఆవిధంబుగ దరిజేరు యసురుజూచి
హడలిపోవుచు మేనంత అల్లలాడ
కనులచిందెడు కన్నీరు కాల్వలగుచు
తనువు ముడుచుకు భీతితో తలనువాల్చె 108

ప్రేమచెలువార తరుణితో ప్రీతిబలికె
"ఎల పంతంబు వీడవు లేమ చెపుమ?
నిన్నుజూచిన దాదిగా నిదురలేదె!
కన్నులు మూసిన నీవె నా కలల నిలచు" 109

ఎందరెందరో రాజుల డిందుచేసి
వీరశూరుడ నేనంచు వీనుమిగుల
దిక్కుదిక్కుల నాకీర్తి పిక్కటిల్లె
తరుణి నను బోలువాడు యీ ధరణిలేడె ! 110

మేరువంతటి సిరులు నామేడ గలవు
భోగభాగ్యాల తులతూగు భోగినేను
వలపుభిక్షకు అర్థినై వన్నెలాడి
నీదు చెంతను నిలచినే బీదనయితి 111

ముద్దులొలికెడు నీ నగుమోముగాంచ
మోహ మెదనిండిపోవునే మోహనాంగి
నిలవజాలనె యింక నన్నేలుకొనవె
వెలది పాదాలుపట్టి నే వేడుకొందు 112

మధువులూరెడి నీమోవి మత్తుకలుగ
ముద్దులాడని బ్రతుకేల ముద్దుగుమ్మ
ఒక్కమాటకు సరియంచు ఒప్పుకొనవె
నీదు సేవకు తలయొగ్గి నిలచియుందు 113

తరుణి సుకుమారలావణ్య తనువునేల
కఠిననేలను పడవేసి గాసిజేయ !
దివ్యభోగాల తూగించు భవనమందు
పడతి పవళించరమ్మ నా పాన్పుపైన 114

ఇన్నిదినములు వోర్చితి నిన్నుకోరి
కరగదేలనె నీగుండె కఠిన శిలయ ?
దేబిరించుచు నిలచితి దీనగతిని
పలుకవేలనె చిలుకలకొలికి దయతో !" 115

అనగ రావణుమాటల కామె కినిసి
దిక్కుగానక యేడ్చుచు వెక్కివెక్కి
యింత ధృష్టతో మాటాడ నేలననుచు
గడ్డిపోచను వానికి అడ్డువేసి 116

"వీరశూరుడ నేనంచు విర్రవీగి
యిట్టి కుటిలంపుపని చేయ దిట్టతనమె
బ్రహ్మకులజుడవయ్యును భయములేక
పరుల దారను చెరబట్టు పాపివీవు 117

బలిమి ననుదెచ్చి యీతీరు బాధపెట్ట
అధమరావణ నీలంక హతముకాదె !
నీ కులంబున లేరె నీ నెమ్మిదీర్చ
మనుజభోక్తవు నీకేల మనుజభామ 118

ఎన్ని తీరులవేడిన ఏను నిన్ను
వలచుటన్నది చూడగా కలయెగాదె !
పరమపావన వంశంపు భామనేను
పరమనీచుడ నీవేడ పాపిధూర్త ! 119

రామచంద్రుండు నాభర్త రమ్యమూర్తి
అహరహంబును దలచెద యతని పదము
నిన్ను బోలెడు వారల నెన్నివేలొ
దేలుపడదోచి అనిగెచ్చు ధీరుడతడు 120

అంతవానితో పగబూన యౌన నీకు
అయిననేమాయె నీవింక యయిన నన్ను
రామచంద్రున కర్పించు రావణేంద్ర
గాచు తప్పక రాముడు కరుణతోడ 121

అటులగాకున్న నీవింక హతముగావె!
అలిగి నాస్వామి చాపంబు అందుకొనెనేని
నిశిత తూణీర వర్షంబు నిన్నుముంచి
లంక లంకంత గూల్చును రణమునందు" 122

పట్టువలమీర భూపట్టి పలుక జూచి
ఆగ్రహంబున కనలుచు యసురుడంత
"కూడు గుడ్డలు లేకను కూళవోలె
అడవులందున తిరిగెడు యనదవాడు 123

చుట్టు శతయోజనమ్ముల గట్టు శరధి
కాపుగానున్న నావీటివేపు జూడ
వేయికన్నులవాడికే వీలుగాదు
యింక రాముడు వచ్చునే లంకలోకి 124

రాముడొచ్చును రక్షించు రమణి యాశ
యింక వదలుము ననుగూడు శంకలేక
సరసశోభన సుందర సరసిజాక్షి
నన్ను వరియించుచే నీకు పెన్నిధవును 125

యిచట యీలంక జొచ్చియు యెవరుగాని
నిన్నుగొనిపోవుటన్నది నిజముగాదు
బీదరాముని కొరకింత ఖేదమేల ?
యిన్ని సుఖములు యిటనుండ వన్నెలాడి 126

కాము బాధకు తాళక గాసిపడితి
కోరికౌగిళ్ళ ననుజేర్చి కోమలాంగి
వివిధరీతుల శృంగారదేవి వోలె
మనసు దీరగ తేలించు మరునికేళి" 127

వానిమాటలు శూలాలవలెను తాకె
వోర్వలేనట్టి బాధతో వువిదయంత
మంటిమింటికి వరదయై కంటినీరు
చేతులందున మోమును చేర్చికొనుచు 128

"ఎంత పాపమ్ముచేసితో ఇంతమాట
వినియు అసువులు పోవేల తనువునుండి
ప్రాణనాధుని ఎడబాసి బాధజెందు
నన్నుగాచెడు పుణ్యులు నాకులేర ! 129

ఓరి పాపాత్మ నీనాల్క చీరిపోను
కారుఃహతలు మానుము ఖలుడ పోర
నీవు ననుతాకి ప్రాణాల నిలుపగలవె
పగిలి నీ మస్తకం కూలి బడదె పుడమి　130

రాముడొచ్చును లంకకు రణముచేసి
అగ్నిబాణాల నిన్నింక హతునిజేసి
నన్ను దోడ్కొనిబోవుట నమ్ము సుమ్ము
వదరులాడుట చాలించు పారుబోత　131

మిత్తిముంచుకు వచ్చినీ నెత్తినుండ
మంచిమాటలు నీకేల మనసుకెక్కు
కాలపాశమ్మె నీకింక పూలమాల
పొమ్ము పొమ్మింక యిటనుండి పొగరువీడి　132

అంత అవనిజ మాటకున్ యసురు కినిసి
"యింత కావరమేలనే యింతి నీకు
మిక్కుటంబైన నీమీద మోహమలర
యింతకాలము గడువిచ్చి యెటులొనుంటి　133

ఒక్క వర్షంబు గడువిస్తి వోర్మితోడ
పదతి గడచెను అందులో షడ్ధియునెలలు
మరియు మిగిలిన యీరెండు మాసములలొ
నీవె రావలె ననుజేర నెమ్మిమీర　134

ఇంక నయినను మాను నీపెంకితనము
మమ్ముగాదని నీవింక మనగలేవు
బలిమి కసిదీర పొందుదు పడతి నిన్ను
కోరి బాధల నేలనే కూలిపోవ ! 135

చివరిసారిగ చెప్పెద చెవినియొగ్గు
భయము నయినను నాపొందు బడయవేని
నాదు భోజనమందున నంజుకొనగ
నిన్ను ముక్కలుచేసుకు నేను తింతు 136

ఓసి రక్కసులార యీ యువిద మనసు
మంచిమాటల మార్చుడి కొంచెమైన
వేవిధంబుల చెప్పిన వినదొ యింక
మట్టుపెట్టియు మింగుడీ మనసుదీర" 137

అగ్నికురియగ నేత్రాల నసురుడార్చి
అవని కన్యను బెదరించి అంతవెడలె
అచట నున్నట్టి రక్కసి యాడవాండ్రు
ధరణిజాత్మజ బాధింప తలచిరంత 138

"దనుజపతి కోర నీకింత తామసంబె ?
నీకు సరికాడె మాస్వామి నెలత చెపుమ
మాదు మాటల నాలించ మంచియగును
జాగుచేసెదవేని నీచావు నిజము" 139

పలుతెరంగుల దూషించి భయము గొలుప
చుట్టుముట్టిరి సీతను బట్టుకొనగ
గోలుగోలున నేడ్చుచు జాలిగలుగ
నన్ను వధియించుడీ మీకు పున్నెమగును 140

అంతియేగాని కలలోన యసురునొల్ల
ఏమిచేసిన చేయుడీ యింతులార
నన్నుపాలించు రాముడే నాకురక్ష
అతని ఎడబాయ నాకింక యసువులేల ?" 141

భూమిపుత్రిక శోకాన పొగిలిపొగిలి
మూర్ఛనొందుచు తెలినొంది ముగద ఏడ్చి
"రామభూపాలు పట్టపురాణి నయిన
దయను ననుగాచు వారలీ దాపులేరే ? 142

పంచభూతములార ఓ భవ్యులార
దిక్కుదిక్కుల నేలెడి దివ్యులార
కరములెత్తియు వేడెద కరుణతోడ
యినకులేశుకు నాజాడలేగి చెప్పుడి !" 143

గొంతు తడియార దుఃఖించి కొంతతడవు
హృదిని కలగించు బాధతో ఎంత తడవొ
యినకులేశుని తలచియు ఏడ్చిఏడ్చి
దారిగానక పొగిలెనా ధరణికన్య 144

అంత దవ్వుల నుండిన యసురులందు
నిదురపోవుచున్నట్టి నెలత త్రిజట
ఒక్క ఉదుటున మేల్కొని ఉరికివచ్చి
సీత దాపున రక్కసి స్త్రీలజేరి 145

"ఇంక వేధింపబోకుడీ యింతులార
ఈమె సామాన్యమానవ లేమ కాదు
మోమునందలి సౌందర్య పోడిమంబు
గాంచుడీ యీమె దేవతా కాంతయగును 146

లలిత లలితంబులయిన యీనెలత మేన
శుభకరంబైన చిన్నెలే శోభనుండె
అంతులేనట్టి సుఖములనందు కొరకె
ఈమె జనియించె నిజము ఈ భూమిమీద 147

కంటినొక కల నేనిప్డు కాంతలార
తలచినంతనె నామేను జలదరించు
భద్రకరినెక్కి సొంపార ప్రాభవమున
తేరిజూడగ లేనట్టి తేజమలర 148

వెల్ల సరిగంచు దువ్వలు వలుగట్టి
మెరసిపోయెడు భూషణాల్ మేనయుండ
వెన్నులందు తూణీరముల్ వ్రేలగాను
వీరు లిద్దరు వచ్చిరే వీటివైపు 149

వచ్చి రావణు బలిమిని బట్టియీడ్చి
నేలబడవేసి మోదెనో నెలతలార !
రావణుండంత రక్తము గ్రక్కుకొనుచు
భూమిపడి పొరలాడుచు పొగిలి ఏడ్చె 150

విరులమాలలు వ్రేలగా వింతశోభ
పసిడి కాంతుల చెలువొందు పల్లకీని
దేవతాకాంత లెందరో తెచ్చియిటకు
సీతముందర నిడిరి వినీతితోడ 151

సీత చంగల్వపూబంతి చెలువుతోడ
మించు అపరంజి కాంతుల మెలతవోలె
శుభగ శోభన సుందర స్ఫూర్తి వెలుగ
అందముగ పల్లకీలోన అధివసించె 152

ఆమె కిరువేపులందున యబ్బురాన
సుందరీమణు లెందరో సొబగుతోడ
అల్లనల్లన వీవనల్ కేయలతి వీవ
రాణిభోగాన వెడలెను రామపత్ని 153

ఆమె దోడ్కొని యచ్చర లేమ లరుగ
వారి వెనువెంట నడచిరా వీరవరులు
జయ నినాదంబు లదరెను క్ష్మాతలంబు
పుష్పవర్షము గురిసెను భూషితముగ 154

పం క్తికంఠుడు తిలసూనె పడియుమునిగి
ర క్తవర్ణపు గంధాల రాచుకొనుచు
మౌళి మకుటంబు పడిపోయి మహినిపడగ
ఖరము నెక్కియు వెడలెను కాంతలార 155

మంటలెగయుచు లంకంత మండిపోయె
అందు పడిపోయి మడిసిరి యసురులంత
అసురకాంతల కన్నీరు యబ్ధిఅవగ
ఘోరుఘోరున విలపించె భూమియదర 156

వేకువందున కలలోన వివరముగను
ఏది కాంచిన అయ్యది వాదులేక
నిజమగుననియు నమ్మిడీ నెలతలార
ఇంక యీమెను వదలుచు యేగుడింక 157

ఈమె కినిసిన యింకెంతొ యిడుములొదవు
దవ్వు దవ్వుల చనుడింక తరుణులార
అనుచు చెప్పగ త్రిజట యా యసురులంత
భీతిచెందుచు పోయిరి సీత వీడి 158

దనుజకాంతలు ఆ తీరు తనను వదలి
పోవుటెరుగదు సీతమ్మ మూర్ఛనొంది
పరిపరివిధాల దరిలేని బాధతోడ
తెలివినొందియు విలపించె దీనముగను 159

ఆ విధంబుగ రావణుండటకు వచ్చి
క్రూరభాషణంబుల చాల కూసి పలికి
వివిధరీతుల నామెను వెతలబెట్టి
మరల చనుటయు గాంచిన మర్కటమ్ము 160

చిన్నిచందురు హసియించు చినిమోము
సుందరంబైన సుకుమార సొగసుతోడ
ఈమె చూడగ మామూలు యింతిగాదు
రాణివాసంబు నుండెడి రమణి యీమె ? 161

ఓర్చలేనట్టి బాధలనుండి కూడ
మెరుగుతరగని మేలిమి మేనిఛాయ
దివ్యసౌందర్య మోహన తేజమలర
ఉత్తమోత్తమ కొలమున యువిద యీమె 162

నామనంబుకు తోచెను నమ్మకముగ
రామచంద్రుని హృదయాధి రాణి యీమె
యింత భక్తితో పతిగొల్చు యింతి కనక
యినకులేశుడు దురపిల్లె యీమె కొరకు 163

ఈమె చెలువును చూడగా యింపుగలుగు
మోముగాంచిన భక్తితో మ్రొక్కనగును
అతివ జాతకరీతిని యరయగాను
యినకులేశుకు భార్యగా యీమె తగును
వీరి దాంపత్యము కనుల విందుగాదె ? 164

పరమపావనమయిన యీ భామ నరయ
నన్ను బంపెను రాముడు నయముగాను
జన్మ ఫలియించె రాముని సఖియ జూడ
వనచరంబుల కులమును భవ్యమయ్యె 165

ఎట్టకేలకు సీతను యిటసుగంటి
అంచు మదిలోన ఎంతయో హర్షమంది
అంతలోపల దిగులొందె హనుమచాల
ఆమె ఉన్నట్టి ఆ తీరు యలతచెంద 166

రాక్షసాంగన లామెను రాయిడించ
వారి బారిని తప్పించువారు లేక
వేసరిల్లియు ప్రాణాలు విడువదలచు
రామదయితను గాంచుచు రామదూత 167

ఏమిచేయుదు నేనిప్డు యీామె బాధ
తీర్చు మార్గము ఎయ్యదీ తెరువుజూడ
ఎట్లు మాటాడు దీమెతో ఏను యిపుడు
చుట్టు రాక్షసస్త్రీలు యీాతట్టు నుండ 168

అనుచు విలపించి యంతలో నాగ్రహించి
దనుజకాంతల జంపగాదలచి మరల
అటులచేసిన కార్యము అవదు యిపుడు
కార్యసఫలత కియ్యది కలసిరాదు 169

ఆవిధంబున మదిలోన హనుమ తలచి
శింశుపావృక్ష శాఖల చివరలందు
ఓర్మిమీరగ ఒకజాము యుండెనటనె
తెల్లవారెడి సూచనల్ తెలియనయ్యె 170

దనుజకాంతలు దవ్వుల జనుట జూసి
మంచిసమయమే యిదియని ఎంచి యతడు
అవనిపుత్రిక దరిజేరు నంతలోన
ఈమె నమ్మనోలేదో నన్నిటుల చూసి 171

దనుజ మాయగా భయమంది తలచునేమొ
ఒక్కసారిగ మాటాడ చిక్కుగలదు
ఏను రాముని తలచెద యిటనెయుండి
నమ్మనేమొ నామాటలన్ నన్నుగూడ 172

రామచంద్రుడు దశరథరాజు పట్టి
అనుగు తమ్మునితోడను యడవులందు
తిరుగుచున్నాడు చింతతో దీనగతిని
అతని బాధను చూడగా నలవికాదు 173

రామచంద్రుని పట్టపురాణి సీత
రాములేనట్టి సమయాన రామనంత
దూర్తరూపాన గొనిపోయె దూర్తుడెవరొ
రమణికోసము వెదుకుచు రామవిభుడు 174

రుష్యమూకంబు దరికొచ్చి యినకులుండు
కాంతనరయుచు కననయ్యె కపివరులకు
అంత సుగ్రీవు స్నేహమ్ము నయ్యెనపుడు
వాలి సుగ్రీవు జగడంబు వారు వినుచు 175

ఒక్కబాణమ్ము వేసియు అక్కజముగ
వాలి వధియించి సుగ్రీవు ప్రభునిచేసె
అంత సుగ్రీవు రాముని యతివ నరయ
ఎన్నొసేనల బంపెను అన్నిదిశలు 176

వారలందున నేనొక్క వానరుడను
అవనిజాత్మజ నరయగా యబ్ధివాటి
లంకజొచ్చితి వెతకితి లంకయంత
యిందు సితను జూచితి యిపుడె నేను 177

ఈవిందబున కీశుడు యినకులేశు
గాధనంతను బలుకగా బాధనొందు
సీత వినియును భయముతో భీతినొంది
ఇదియు రావణు మాయగా ఎంచి మదిని 178

రామ హా రామ శ్రీరామ రామయనుచు
జనకసుత ఏడ్చె రాముని చాలదలచి
ఆమె చింతను వీక్షించి హనుమకూడ
పనవి దుఃఖించె తానును బాధచెంది 179

నమ్మ సీతమ్మ వనచరున్ నన్ను నమ్మ
దనుజమాయలుగా నన్ను తలపవద్దు
రాజు సుగ్రీవు మంత్రిని రాముడంపె
హనుమ యందురు నన్ను నిన్నరయవస్తి 180

హనుమ మాటలు అవనిజ యాలకించి
కౌతుకంబున క్రోతిని గాంచెనంత
కొంత భయమును ముదమున కొంత కలిగె
అపుడు హనుమన్న దుమికెను యామెదరికి 181

ఆమెముందర నిలచియు మోమువంచి
కేలుగవమోడ్చి పలికెనా కీసుడంత
రామచంద్రుని దూతను రమణి నేను
భయములేకుండ నాతోడ పలుకు తల్లి 182

రామచంద్రుని నామమ్ము రామ వినుచు
అతని ఏడబాటు బాధకు ఆగలేక
కొంత తడవేమొ మదిలోన సంతసించి
కొంత తడవేమొ దుఃఖించె చింతనంది 183

మనసునోర్వని బాధతో మగువయంత
యింక మదిలోన నేదియో శంకగలుగ
అన్న ! దయతోడ నామాట నాలకించి
రామలక్ష్మణ రూపాల ప్రాభవంబు
వరుసలెట్లుండె చెప్పుమా వానరేంద్ర 184

అంత హనుమన్న యెంతయో హర్షమంది
పొంగిపొరలెడు సంతసం నింగితాక
ఇనకులేశుని రూపమ్ము యెంచి మదిని
కనుల నానంద భాష్పాలు కారుచుండ 185

"జలదనీలిమ తలపించు ఛాయమేను
కమలరేకుల హసియించు కనులసొంపు
కంబుకంఠంబు నొప్పారు ఠంబుమిగుల
పీనవక్షంబు చూడగా ప్రియముగలుగు 186

నవ్వుమోవిని కెంజాయ ననుపునొప్పు
మకరకుండలాల్ చిందించు మణులకాంతి
చిలుకరేతుని ధనువులై చెలగు బొమలు
అందమెగబోయు కస్తూరి యగరుబొట్టు 187

బలము సొంపారు ఆజానుబాహు యుగళి
కేలపెనువిల్లె పగతుని కీడుపరచు
మృదుల చరణాలు గాంచిన మ్రొక్కనగును
అతని తేజంబు వీక్షించ నలవికాదు 188

మధువు చిందెడి రీతిగా మాటలుండు
శరణుకోరిన వారిని కరుణగాచు
సింహ శార్దూల కరిరాజు చెలువు నడక
ఎల్లవారిని కరుణతో యెపుడుచూచు 189

సకలధర్మాలు నిష్టతో చదివి నేర్చె
సత్యవాక్కుల బలికెడు సత్యమూర్తి
పెద్దలందున భక్తితో ప్రేమజూపు
పిన్నలన్నను చెలిమితో ప్రీతిపలుకు 190

అస్త్రశస్త్రాల గూఢముల్ యతనికెరుక
సాటిలేనట్టి విలుకాడు శౌర్యధనుడు
అతని కెదురొడ్డి నిలువగా యవనిలేరు
అతని బాణమ్ము తప్పక అరిని గూల్చు 191

నీతినియమాలు దప్పడు నెలత యెపుడు
రాజధర్మాలు నెరవేర్చు రాచబిడ్డ
గొప్పశీలమ్ము అందమైనొప్పు తనకు
సకల భువనాలు యేలగాచాలు నతడు 192

శుభకరంబైన చిన్నెల శోభతోడ
అందచందాల చెలువొందు అంగములతో
రాజులందరి తలదన్ను తేజమలర
రమ్యమయినట్టి రూపమ్ము రాముదమ్మ 193

ముగ్ధ సుకుమార సౌందర్య మోహనుండు
యిన్నిగుణముల నొప్పారు యినకులేశు
డతని అనుజుడు సౌమిత్రి అన్నబోలు
మిసిమి బంగరు ఛాయల మేనువాడు 194

అన్నకంపెను క్రోధంబు అతనికుండు
అన్నయాజ్ఞను తలదాల్చు మిన్నగాను
అన్ననెప్పుడు వీడని యనుజుడతడు
అన్నబోలెడు వీరుడే యతడుకూడ 195

అన్నదమ్ములు ఒక్కటై యనిలోనించి
మిగుల కోపాన కోదండమె త్తిరేని
వీరుడెవడేన ఎదురొడ్డి వీగిపోవు
వారిగెలుచుట శక్యమే యేరికయిన ?" 196

రామలక్ష్మణ గుణరూప సామ్యములను
భక్తిమీరగ హనుమన్న పలుక చాల
హర్షమందుచు రఘురాము నాత్మదలచి
సీత కన్నీరు గార్చెను చెలమలవగ 197

"ఎంతకాలమ్ము యయ్యెనో ఆత్మధవుని
వీడియిచ్చట యేను యీ వేదనలతో
చివికిపోవుచు రాముని చింతతోడ
ఎదురుచూచితి స్వామికై ఎన్నినాళ్ళో 198

స్వామిరాడేల యెంతకు ఏమిదారి ?
యిచట నేనున్న యీతీరు యినకులేశు
డెరుగడాయెనొ యేమాయె నేమిచేతు
ఎంతొవగబొంది దిగులొంది వంతనుంటి 199

నేటికిన్ రామచంద్రుని మాటవింటి
అన్నదమ్ములు క్షేమమా ? యనిలసుతుడ
వారలేరీతి నుండిరో వనములందు
మనసు అలరగ చెప్పుమా మాకు హనుమ 200

ఇనకులేశుడు నను వీడి ఎట్టులుండె
నిత్యధర్మాలు నెరపునా నీతితోడ
అనుగుతమ్ముని సేవలు నందుకొనుచు
దిగులులేకుండ నుండెనా తెలియచెపుమ 201

ధర్మనిరతుడు మిథిలేశు తండ్రినాకు
మాటదప్పని దశరథు మామనాకు
వీరపూజ్యుడు శ్రీరాము విభుడునాకు
విమలమయినట్టి వంశాన వెలదినేను 202

వీరశుల్కముగా రామువీటి కరిగి
రామభద్రుని హృదయాన రాణినయితి
ముప్పురత్తల నడుమన ముదముమీర
గారవంబున కొన్నాళ్ళు కలిమినుంటి 203

కొంతకాలమ్ము గడువగా కోసలేలు
రాజు తలపెట్టె రాముని రాజుచేయ
రామచంద్రుడు పట్టాభి రాముడనిన
ఎల్లవారలు పొంగిరి యుల్లమలర 204

దశరథీశుని ముద్దుల దయిత కయిక
రెండు వరములు కోరెను రేడునపుడు
రామచంద్రుడు అడవికి రయమునేగ
అంత భరతుడు రాజుగా నౌనుఅటుల 205

ఆడితప్పని రేడంత యడలియేడ్చె
యినకులేశుడు జనకుని యనునయించి
తండ్రియాజ్ఞను తలదాల్చి తపసివోలె
అడవులందున వసియింప అపుడువెడలె 206

పతిని యెడబాసియుండుట సతులకెపుడు
ధర్మమార్గము కాదని తలచి నేను
రాణివాసమ్ము వదిలియు రాముతోడ
వనములందున వసియింప పయనమయితి
మాకు అనుగామి యగుచును మరదివచ్చె 207

భర్తతోడిదె భాగ్యమ్ము భార్యకనగ
కందమూలములు దినుచు కాననమున
చింతలేకను శ్రీరాము చెంతనుంటి
కనులుమూయక సౌమిత్రి గాచుమమ్ము 208

వనములందలి దనుజులు బాధపెట్ట
మిగులశౌర్యాన యొక్కడే విక్రమించి
వారిగూల్చెను రాముడు వాసికెక్క
అడవులందలి తపసులు హర్షమొందె 209

ఒక్కదినమున చూడగా చక్కగాను
మెరిసిపోయెడు జిలుగుల మేనితోడ
వెలగు హరిణ మచ్చటచేరి చెంగనాలు
వేయ జూచి తెమ్మని రాము వేడుకొంటి 210

రాము దానిని పట్టగా రయముగాను
దవ్వుదవ్వుల కేగెను దానివెంట
ధ్వని కేకలువినరాగ దడిసి నేను
పతికి సాయము లక్ష్మణున్ బంపినాను 211

ధవుడు మరదియులేని ఆ తరుణమందు
సాధు వొక్కడు వచ్చియు చాచీకరము
బిచ్చమడిగెను నేనంత భిక్షమేయ
బలిమి ననుబట్టి వాడంత పరువులెత్తె 212

వాడె రావణు నీచుడు వానరేంద్ర
పెట్టి చెరలోన నను బాధబెట్టుచుండె
రాము డొచ్చును ననుగాచు లంకకొచ్చి
యింతకాలము జీవించి ఎటులొయుంటి 213

పరమధూర్తుడు రావణు పాల్బడితి
వీనిభస్మము గావించ నేనుచాలు
రామచంద్రునకే కీర్తి దావలెనని
యింతకాలమ్ము వోర్చితి యిచ్చటనేను 214

రాము డింకను రాడాయె యేమిసేతు ?
క్రూరరాక్షస బాధల కుమిలిపోతి
రామునెడబాసి మనలేను రామదూత
యింక అసువులు వదలుటే యిరవునాకు" 215

పలుతెరంగుల భూపట్టి పనవి పనవి
యినకులేశుని మదిలోన ఎంతొ తలచి
శిలలు కరిగెడు రీతిగా సీత యేడ్వ
ఆమె నెంతయొ నోదార్చి హనుమ అనియె 216

"యీవిధంబున నేడ్వగా నేలనమ్మ
రాముడెంతయొ క్షోభిల్లె రామనమ్మ
నిన్ను వెసుకంగ బంపగా నేనువస్తి
యింక కార్యము చక్కనౌ శంకవలదు 217

ఈవు యిటనున్న యీ తెర్వు యినకులేశు
వినియు హర్షమ్మునందుచు విక్రమించి
క్రూరరావణు బట్టియు కూల్చివేయ
వానరేంద్రుల సేనతో వచ్చు నిజము 218

నిన్నుగానక రాముడు దిగులుతోడ
అన్నపానీయములు మాని యడవులంచు
వెదకి వెదకియు చురపిల్లి వేసరిల్లె
యింక నీ జాడ తెలిసిన యిటకురాడ ? 219

నమ్మ నాతల్లి భూపుత్రి నాదుమాట
నీకు బంపెను రాముడు నెమ్మిమీర
ముద్దుటుంగరమిది తన మోహమలర
దీని చేకొని మదిలోన దిగులుమాను " 220

హనుమ యిచ్చిన ఉంగర మందుకొనుచు
రామచంద్రుని జూచిన రమ్యగతిని
భూమిపట్టికి నెమ్మేను పులకరించి
సిగ్గుచిన్నెలు మొలకెత్తె బుగ్గలందు 221

ముదముమీరగ మనసున మోహమలర
కనులనద్దుకు దానిని కాంచికాంచి
రామచంద్రుని మది అనురాగమెంచి
జానకీదేవి యెంతయో సంతసించె 222

అన్న హనుమన్న నామాట నాలకించు
ఎన్నినాళ్ళాయెనో జూచి యినకులేశు
ఇంక నిలువంగ జాలను ఏను యిటను
రామచంద్రుకు చెప్పుమా రయముతోడ 223

ఇంకవుండెను గడువేమొ రెండునెలలు
అదియు గడిచిన నాచావు ఔను నిజము
దనుజుడొచ్చియు నను జంపు తప్పకుండ
వానిపాలను పడకుండ ప్రాణములను
వదలివేతును రాముని పదముదలచి 224

ఎటులనయినను చెప్పుమా యిటకువచ్చి
రామచంద్రుడు ననుగావ రాజసమున
నాదు మనమున రామునే నమ్మియుంటి
రాముడేరీతి లంకకు రాగలండొ ! 225

తెలిపి తనబాధ జానకి దిగులుపొంది
తలచి తలచియు విలపించె ధవునికొరకు
చెరలచివికిన సీతమ్మ తెరువుచూడ
హనుమ మదినెంతో బాధతో నామెకనియె 226

" ఇంక దిగులేలనమ్మరో నేనువెళ్ళి
నీవు యిందున్నవార్తను ఎరుగచెప్పి
రామలక్ష్మణులిద్దోడ్తెత్తు రమణి యిటకు
ఆలసింపను నమ్మము అంబుజాక్షి 228

రామచంద్రుని బాణ వర్షంబునందు
రావణేశుని సేనలు తృణముగాను
అగ్ని బాణాల కాహుతిగానగును నిజము
రామబాణాల మడియును రావణేశు 228

ఇంక తూణీరవేగాన లంకయంత
నిట్టునిలువున కూలుచు నీరుగాదె ?
సందియంబేల నమ్మరో జయముమనదె
సుంతవోర్మితొ నుండుమా భూమిపుత్రి 229

పలుతెరంగుల జానకి వంతదీర
పవనసూనుడు పలుమారు పలికి పలికి
కేలుముకుళించి వేడెను కృపదలిర్ప
బోయివచ్చెద శలవిమ్ము పుడమిపుత్రి ! 230

రామచంద్రుకు తృప్తిగా రమణి నీవు
నేదియయినను గుర్తుగా నిమ్ము నాకు
ఇంకనేవెళ్ళి రాముని యిటకుదెత్తు
భయము మానము తల్లిరో స్వాంతమందు" 231

హనుమ వెళ్ళెదననగానె నామెచాల
దిగులు హర్షముపెనగొను తీరునేడ్చి
కొంగుముడిలోన పదిలాన యుంచినట్టి
శిరసుదాల్చెడి రత్నంబు సీతయిచ్చె 232

"అన్న హనుమన్న యేరీతినయిన నీవు
రామచంద్రుడు యీ సాగరమ్ముదాటి
వచ్చునట్లుగ దయతోడ పలుకు తండ్రి
ఈరువచ్చెడి నందాక ఎటులోవోర్తు !" 233

నెలత యారీతి దిగులొంది నేడ్వగానె
హనుమ మదినెంతొ జాలితొ నామె కనియె
"ఇంత బాధతొ నీవిట యేలనుండ
నిన్ను దోడ్కొనిపోయెద నేను యిపుడె 234

నా భుజంబున నిను దాల్చి నమ్మకముగ
అబ్ధి లంఘించి కీశులు హర్షమంద
రామభూపాలు కర్పింతు రయముగాను
రమ్ము పోవుదమమ్మరో రమణి యిపుడె" 235

మిగుల భక్తితో హనుమన్న మోమువంచి
వినతిచేసెను ఆమెను వేడుకొనుచు
అతని మాటలనాలించి యవనికన్య
హర్షమందుచు హనుమతో ననియె నిటుల 236

"నీదు భక్తికి మెచ్చితి నిజముగాను
కాని సందియంబొక్కటి కలదు నాకు
ఇంతయున్నావు చూడగా యెట్లు నీవు
మమ్ము మోసుకుపోదువే మారుతాత్మ !" 237

సీత మాటల కెంతయో చింతనొంది
అంతలోపల పౌరషంబధికమవగ
ఎంతో పెంచెను కాయమ్ము వింతగాను
చుక్కలంటెడు రీతిలో చోద్యమవగ 238

దివ్యతేజంబు వెలార్చు దీప్తితోడ
యిపుడు మోయంగజాలనా యేను నిన్ను
అనుచు వందనంబిడి నిల్చు హనుమజూచి
అచ్చెరువు హర్షములు పొంగె యామెమదిని 239

కు
కపిలేశ్వర నీ రూపుగాంచినాను
ఇంతవాడివికనుకనే ఇనకులేశు
డెంతో నమ్మకముంచి నిన్నిటకు బంపె
నీదు మూపున ననుగొని నేగగలవు 2

అంత బలముండె నీకును అయినగాని
రామచంద్రుడు శూరుడై లంకజొచ్చి
క్రూరరావణు రణమున కూల్చివేసి
నన్ను చేకొనిపోవలె సన్నుతముగ 2

నేనె రావణు జంపగా నేర్వగలను
అయిన రాముకె యాగొప్ప యశముదక్క
వలెనటంచును వోర్చితి పవనపుత్ర
కనుక నీవెంట రాజాల కినుకవలదు” 2

జనకపుత్రిక మాటకు సంతసించి
“అమ్మ నీయూహలెంతయో సమ్మతంబె
నేను యీమాట రాముతో నెమ్మిచెబుదు
ఇంక శలవిమ్ము పోయెద ఇందువదన” 2

“రామవిభుకెంతో భక్తితో మ్రొక్కినటుల
నాదు మాటగ చెప్పుమా నయముగాను
ప్రేమనడిగితి లక్ష్మణు క్షేమమనుము
పోయిరమ్మింక శుభములు పొందు నిన్ను”

కనులనిండిన కన్నీరు కాల్వలగుచు
దీనరూపంబుతోడను దిగులుచెందు
జానకమ్మను వీడియు చనగలేక
ఎటులో కదిలెను సామీరి యేగదలచి 245

అంజలించియు యామెకు హనుమ యెగసి
అచటనుండిన వృక్షంబులందు నిలచి
యిపుడు నేనింకచేసెడి దేమిటనుచు
యోచనంబునుచేయగా తోచెనొకటి 246

నేను యీరీతిపోయిన నేమిఫలము ?
తెలియచెప్పగవలెను నా తెరువుఇంక
రాక్షసాధము డెంతనో తెచ్చపడగ
యీవనంబును కూల్చెద యిపుడెనేను 247

అందమొప్పార విలసిల్లి సుందరముగ
విస్తరించిన ద్రుమములు విరుగదోచి
ననలు సాగిన తీవెలు నలిపివేసి
పండుఫలములు డులిపించి బదరజేసె 248

కొమ్మకొమ్మకు దుముకుచు క్రోతిఘనుడు
పూలజొంపాలు తెంచియు పోగుపెట్టి
కనులకింపైన వాటిక కచ్చెదీర
కుప్పిగంతులు వేయుచు కూల్చివేసె 249

ఆవనంబున వసియించు అండజములు
హరిణశాబక మృగములు హడలిపోయి
గంద్రగోళాన కుయ్యిడె గంతువిడుచు
చక్కగానున్న వనమెల్ల జర్జరించ 250

ఒక్కపూపున వనమెల్ల పూపువేసి
కకలికలుచేసి ఖండించి గత్తరాన
హనుమయుండుట గాంచిన యసురులంత
పరుగుపరుగు పోయిరి భయముతోడ 251

రాక్షసులు వెళ్లి చెప్పిరి రావణునకు
"అందమయినట్టి వనినెల్ల ఆగడాన
కోతియొక్కటి దానిని కూల్చివేసి
అల్లకల్లోలమొనరించె యసురనాథ 252

అంతియేకాదు దేవర యవధరింపు
సీతదరికేగి యాకోతి చెప్పెనేమొ
చాలతడవేదొ గుసగుసల్ సలిపినారు
పట్టి కోతిని దండింపవలయు మీరు 253

వారిమాటల నాలించి పల్లుగీటి
చెంద్రనిప్పులు నయనాల చెరిగిపోయ
"ఎంత సాహస మీలంక కేగుదెంచి
పాడుచేసెనె వనమెల్ల పాడుకోతి 254

ఒక్క కోతికి భయపడి ఉరకనేల
ఇంక అటనుండి తరుముడీ యిపుడెపోయి
పట్టితెండిక దానిని కట్టివేసి"
అంచు భటులను బంపెను అసురరేడు 255

బిట్టుయార్చుచు రాక్షసుల్ భీకరముగ
హనుమయున్నట్టి యా వనమందు జేరె
వారిగాంచిన హనుమన్న భయములేక
జయనినాధంబు చేసెను జబ్బచరచి 256

" జయము విజయము శ్రీరామచంద్రునకును
జయము విజయోస్తు రఘుకుల సంభవునకు
జయము సాకేతరాజుకు సకల జయము
జయము దశరథపుత్రుకు జయము జయము 257

జయము సౌమిత్రి కెంతయు జయముకలుగు
జయము దినకరపట్టికి జయము నిజము
జయము రాముని దూతకు సన్నుతింప
జయము చేకొనిపోయెద సంగరమున " 258

అంచు జయమును బలుకుచు ఔరయనగ
వాలమల్లార్చి దర్పించి పావనుండు
దనుజవీరుల నెదిరించె కినుకతోడ
సోకులంతట పోరెరి శూరులగుచు 259

సంకులంబుగ సమరము జరిగెనపుడు
దనుజవీరుల బాణాల తరిమిగొట్టి
పెద్దచెట్లతో వారిని బెదరదోచి
రాళ్ళవర్షంబు కురిపించె రామదూత 260

హనుమదాటికి దనుజులు ఆగలేక
పారజొచ్చినవారిని పట్టిదెచ్చి
మట్టి పడవేసి వాలాన చుట్టికొట్టి
దనుజులందరి జంపెను దనుజవయిరి 261

ఆవిధంబున కీశుడు యచ్చెరువుగ
సోకులందరి జంపెను తోకతోనె
అన్నమాటకు రావణు డాగ్రహించి
మరల దస్యుల బంపెను మత్సరముతొ 262

ఉగ్రరూపాన ఎదురొడ్డి వూచిగొట్టి
వారలందరి వధియించె వానరుండు
మరలవచ్చిన వారిని మరల మరల
దీలుపడదోచి యనిగూల్చి దివికినంపె 263

జంబుమాలియు మడిసెను సంగరమున
అంత అక్షకుమారుండు యసిలొజచ్చె
ఎంతరెందరొ వీరులు యేగె దివికి
యింకవచ్చెను అనిజేయ యింద్రజిత్తు 264

మేఘనాధుండు శౌర్యాన మించివచ్చి
హనుమ దర్పంబు వీక్షించి అబ్బురముగ
"కోతి చూడగ మామూలు కోతిగాదు
వేల్పులంశాన వాడేమొ వింతనుండె ! 265

ఇతని తోడను తలపడ నేగునప్పుడు
చాల మెలకువగావలె సంగరమున "
అని తలంచుచు మదిలోన హనుమజూచి
మేఘ ఘర్జనకావించె మేఘనాధు 266

"జయము విజయము శ్రీరామచంద్రులకును
జయము సీతమ్మభర్తకు జయము నిజము"
అంచు పలుమారు బలుకుచు హనుమనిలచె
యింక జరిగెను యుద్ధమ్ము యిద్దరకును 267

ఎన్నొ బాణాలు వేసెను యింద్రజిత్తు
అన్ని బాణాలు పడగొట్టె హనుమయార్చి
బండరాళ్ళను చెట్లను బలిమివేసి
యింద్రజిత్తును అలయించె నెంతగానొ 268

ఇటుల శస్త్రాలు పనిజేయ వితనికనుచు
బ్రహ్మఅస్త్రంబువేసె మంత్రంబుతోడ
ఇంకవోడును యితడంచు యింద్రజిత్తు
అంత హనుమ కట్టుబడెనా యస్త్రమునకు 269

మూర్ఛనొందినట్లు కనులుమూసి హనుమ
దబ్బుమంచును పడిపోయె ధరణిమీద
దనుజులంతలోన యతని దరికివచ్చి
కట్టివేసిరి హనుమను కదలకుండ 270

తాళ్ళుకట్టివేయ హనుమ తనువునందు
బ్రహ్మయస్త్రంబు కట్టులు బాసిపోయె
ఎంతొ దిగులొందె యదిజూచి యింద్రజిత్తు
అయిన ఇటులనె గొనిపోదు యని తలంచె 271

"ఓరి భటులార తెండిక ఒడిసిపట్టి
దనుజభూపతి మా తండ్రిదరికి నిపుడె
అచట యీకోతి బలమేమొ యణగిపోవ-
శిక్షవేయును రావణు కక్షదీర ! 272

" ఇదియు మంచిదె కానిమ్ము ఇతనితోడ
అసురు డుండెడి సౌధంబు నరయబోయి
రావణేశుకు చెప్పెద రాముగూర్చి "
అంచుమదినెంచి యొదిగుండె హనుమయపుడు 273

అసురులంతట కొట్టుచు అలుసుతోడ
లాగుకొంచును బలిమిని వేగతెచ్చి
అతిశయించెడు అందాల నమరియున్న
కొలువునందున వేసిరా క్రోతినపుడు 274

కొలువుతీరిన దనుజుడు కోతినరసి
ఎవడవీవుర ? నాలంక కేగుతెంచి
కోతిచేష్టలు చేసిన కోతిగాడ
ఇపుడు జూపుము నీ బలమెంత కలదొ ! 275

కారుకాటుక ప్రోవునా కాయ మమర
పట్టుజేగురు వర్ణంబు దట్టికట్టి
తారహారముల్ యురమున తళుకులీన
మేలిరత్నాల మకుటంబు మెరిసిపోవ 276

రమణులెందరొ వింజామరాలు వీవ
వంధిమాగధులట బరాబరులు చేయ
మనసు కనిపెట్టి చెప్పెడి మంత్రులుండ
పసిడిగద్దెను వసియించె దశముఖుండు 277

అంత ఆర్భాటములతోడ హంగుమీరి
మిగుల కోపాన మిడిగుడ్లు మిడికి చూసి
బలెమికొట్టెడు రీతిగా బలుకువాని
దశముఖుని గాంచె హనుమన్న ధడుపులేక 278

ఎంతశౌర్యము సొంపారు ఇతని రూపు
ఎన్ని సిరులుండె నీతని ఇంటియందు
రాజులందరి తలదన్ను రాజుగాడె
ఇంత నీచుడుగాకున్న యెంతబాగు 279

మదిని మెచ్చుచు రావణున్ మరల జూచి
వానిమాటల నాలించి వానరుండు
ఇంత పాపాత్ముడీతని నేలమెచ్చ
నంచు తలపించి దనుజుతో ననియె నపుడు 280

"వాలి అనుజుని మంత్రిని వానరుడను
దశరథుండను నొకరాజు ధరణి కలడు
అతని పుత్రులు ఇరువురు అడవికరిగె
రామలక్ష్మణు లనువారు రావణేంద్ర 281

రామచంద్రుని పట్టపురాణి సీత
ఆమెకూడను రాముతో యడవినుండె
రాములేనట్టి సమయాన రమణినంత
ధూర్తరూపాన గొనిపోయె ధూర్తుడెవరో 282

అన్నదమ్ములు అడలుచు యడవులందు
నెలత వెదకుచు సుగ్రీవు నెలవు కరిగి
వాలి యనుజుని స్నేహంబు వారికయ్యె
వాలి వధియించి సుగ్రీవు భయముబాపి
రాజుచేసెను సుగ్రీవు రామవిభుడు 283

సీత జాడకు సుగ్రీవు సేనబంపె
అంత వెళ్ళిరి కీశులు యన్నిదిశలు
వారలందున నేనొక్క వానరుడను
ఆమె నరయంగ వచ్చితి యసురనాథ 284

రావణేశుడ ! వెదకితి రమణి కొరకు
ఎట్టకేలకు గాంచితి ఇంతినిటను
జనకపుత్రిక పతి రామచంద్ర విభుడు
అనిలో గెలువంగ జాలని యధికుడతడు 285

అంతవానితో పగయేలనయ్యా నీకు
పెద్దలందరు మెచ్చగా బుద్ధికలిగి
జనకజాత్మను శ్రీరామచంద్రు కొసగు
నిన్నుగాచును రాముడు నిజముగాను " 286

హనుమ మాటల నాలించి యసురుడంత
ఆగ్రహంబున నార్చుచు " ఔర వీడు
ఎటుల పేలాపనముచేయ నెంచినాడొ
యింక వీనిని నిలువంగనీయరాదు 287

కోతినిప్పుడె జంపుడీ కూలద్రోసి
చెనకి వీడేమొ బుద్ధులు చెప్పునంట
అవని యంతయు గెల్చిన యసురునేను
అట్టి నను గెల్చునా రాముడహ్హ వహ్హ ! " 288

పదియు నోళ్ళతో దిక్కులు యదరిపోవ
బిట్టునవ్వెను రావణు భీకరముగ
అంత హనుమన్న దరినేగి యసురులపుడు
పట్టి చంపగపోయిరి బలిమితోడ 281

హనుమ బెదరక క్రోధాన అసురుజూచి
"దనుజ పాపాత్మ ననుజంప తరమె నీకు ?
బ్రహ్మయస్త్రంబు నన్నింక బట్టలేదు
నిన్ను నీవారి గూల్చియు నేగగలను　290

అయిన రామాజ్ఞ లేదురా యసుర నాకు
రామదూతగ వచ్చితి రావణేంద్ర
సీత నరసియు రమ్మనె సీతవిభుడు
సీత గాంచితి పోయెద శీఘ్రమేను　291

నాదుమాటల నాలించి నయముగాను
పడతి నొసగితివేనియు బ్రతుకగలవు
యివ్వకుండిన రాముడు యిటకుజొచ్చి
దనుజులందరి జంపుట తథ్యమగును"　292

ఉగ్రరూపాన రావణుం డురిమినటుల
"ఓరి భటులార మ్రింగుడీ కోతిన"నుచు
బిట్టుయార్చుచు తిట్టుచు భీషణముగ
కనుల నిప్పులు రాల్చుచు గద్దెడిగ్గె　293

అంతలోన విభీషణుండటకు వచ్చి
వినతిచేసెను తలవంచి వేడుకొనుచు
"అన్న నామాట వించుక నాలకించు
పొందుకాదయ్యా కోతితో పోరుమనకు　294

ఎన్నో ధర్మాలు తెలిసిన ఇనుడ వీవు
దూత జంపుట రాజుల నీతికాదు
నీదు కోపమ్ముదీరగ నితనికిపుడు
వేరు విధముగ శిక్షించి వేగబంపు" 295

అంత సభలోనివారలు ఔను యనుచు
"కోతిజంపిన నీకేమి కూడివచ్చు
నీకుగల శక్తిశౌర్యము నేర్పునంత
రాముమీదను జూపుము రావణేంద్ర 296

వాలమందునె బలముండు వానరులకు
తోకగాల్చిన శక్తియు తొలగిపోవు
కాన నీతని తోకను గాల్చనగును"
అనగ తలయూచె రావణుండర్షమొంధి 297

అపుడు రక్కసులందరు హనుమబట్టి
వాలమందున చుట్టిరి వస్త్రములను
తయిలములు దెచ్చిపోసియు తడిపివేసి
అగ్నిముట్టించి వదలిరి హనుమతోక 298

మోది హనుమను త్రోయుచు ముదముమీర
తప్పెటలమోత తాళాల దద్దరిల్ల
దనుజులందరు మది వినోదంబుగలుగ
వీధివీధుల తిప్పిరి వింతగాను 299

త్రిప్పితిప్పియు వదలగా తిమ్మడంత
మంటలెగసెడి తోకతో మింటకెగసి
కెరలు కోపాన ఘూటించి కేకబెట్టి
వీరి పొగరంత నణచెద వింతగాను 300

తోకగాల్చిరి వీరు యీతోకతోనె
ఇంక నాశక్తి చూపుచు లంకయంత
బుగ్గిబుగ్గిగ చేసెద అగ్గిపెట్టి
అంచు దుమికెను సౌధంబులందు హనుమ 301

ప్రజ్వరిల్లుచు మంటలు పటపటల్తో
కూలసాగెను సౌధాల నసురులంత
గుండెబాదుకు మది కలగుండు పడుచు
బిట్టునేడ్చుచు పరిగెత్తె భీతితోడ 302

అంత రక్కసి వనితలు కొంతమంది
భీతిచెందుచు వెళ్లియు సీతదరికి
"సీత నీతోడ పలికిన కోతితోక
అగ్గిముట్టించె రక్కసుల్ "యనిరివారు 303

వారి మాటల నాలించి భయమునొంది
కళవళించుచు కన్నీర్లు కనులజార
కపివరున కెంతటెంతటి కష్టమొచ్చె
నను చు చింతించె నెంతయో నవనికన్య 304

అతడు నను గాంచ కేతెంచు నవసరమున
గాదె యింతటి వెతనొందె గాడ్పుబిడ్డ
కీశుడిటకొచ్చి యెంతటి కీడునొందె
యింక నీతని గాచువారించు కలరె ! 305

హనుమ కొరకెంతొ దుఃఖంబు యధికమవగ
అతనిగావంగ తెరువెద్ది యంచుపొగిలి
మిగులబెగడొంది బేలయై మిథిలకన్య
అగ్నిదేవుని భక్తితో యాత్మదలచె 306

" పుణ్యచరితుడు జనకుని పుత్రినేని
పతితపావను శ్రీరాము పడతినేని
భర్తచరణాలు నమ్మిన భామనేని
ఏ కళంకమ్ము లేనట్టి యింతినేని 307

విభుని శ్రీరాము మదినెంచి వేడుకొందు
రాముడంపగ వచ్చిన రామదూత
అతని వాలముగాల్చిరి యసురులిపుడు
అగ్నిబాధల కాతడు నలయకుండ
పావనుని గావుమోతండ్రి పావకుండ ! " 308

ఇటుల మదినెంచి జాలితో ఎంతొవేడి
వీతిహోత్రుని ప్రార్థించె సీతయపుడు
ఆమెమాటలు మన్నించి యగ్నియంత
మంచు తెమ్మెరలయ్యెను మారుతునకు 309

వాలమందున మంటలు వానరునకు
బాధలేకుండ చల్లనై వహ్నియుండ
అచ్చెరువు నందగానయ్యె హనుమకపుడు
రామచంద్రుని దలచి విశ్రాంతినందె 310

మలయ చందనమననొప్పు మనసుకెంతొ
హాయిగొల్పెడి రీతిగా నగ్నియుండ
ఇనకులేశుని మహిమగా నెంచవలెను
నన్నుగావగ చేసెను నాకుమేలు 311

పావనుండంత రాముని పదముదలచి
వందనంబిడి నిండార భక్తితోడ
మింటిమంటికి లంకంత మంటలెగసి
కాడుచేయగ వీక్షించె వేడుకలర 312

పసిడికాంతుల వెలుగొందు భవనములను
బుగ్గికుప్పగ నణగారె నగశిఖల
దహనమయ్యెడి వీడుల దస్యులంత
తల్లిపిల్లలు ఏకమై తల్లడిలిరి 313

కోతితోకను గాల్చగ వీతిహోత్రు
డింత ఉత్పాతమునుచేసె యేమిదారి
కోతిగాదమ్మ మిత్తియె కూల్చవచ్చె
ఇంక మనమెట్లు జీవించు లంకలోన 314

అగ్నివదలక సౌధాల నన్నిజుట్టి
మణులకూర్చిన రాపణు మహలుకూడ
మూలమట్టము గావించి కూలదోసె
పచ్చపచ్చని వనములు భస్మమయ్యె 315

దహనమయ్యెడి లంకలో దస్యులంత
ఘోరఘోరున విలపించి పొగులసాగె
హనుమ వారిని గాంచుచు హర్షమంది
చంకలెగరేసి ఎగసెను జలధివైపు 316

అంత హనుమడు తోకను అబ్ధిలోన
ముంచిచల్లార్చి నిలచియు ముదముమీర
వీతిహోత్రుని విలయాన బూతియయిన
లంకచూడగ మదినేదొ శంకగలిగె 317

మండిపోయిన యాలంక మండలమున
గజతురంగము లెన్నియో కమిలిపోయి
వీరశూరులు రాక్షసుల్ వీధులందు
కాలిపడిపోయి దొరలెను గములుగాను 318

వనచరంబులు యెన్నియో వహ్నిజచ్చె
అనలమందున రాలెను అండజములు
అందములుచింద యాలంక చందమంత
నేలరాచిన కాలుని లీలనుండె 319

భవనములెగాక వనములు భస్మమయ్యె
గుండెలవిసెను హనుమకు కొంతలమున
వహ్నిబడియుండునేమొ అశోకవాటిగూడ
సందియములేక కాలును అందు సీత 320

ఇనకులేశుండు ననుబంపె యింతిజూడ
గాంచిరమ్మన్న నేలంక గాల్చివేసి
వనమునందున్న సీతయు వహ్నిమడియ
ఇంక నేబోయి రాముతో నేమి చెప్పు 321

అబ్ధి లంఘించి నేలంక యందుజొచ్చి
సీత గాంచితినయ్యనే శీఘ్రముగను
అందుమీవట యాలంక కగ్గిపెటితి
అవనిజాత్మయు గాలెను యవనినాథ 322

ఇనకులేశున కీరీతి నేను జెప్ప
క్రోధపూరితుడయి రాముగూల్చు నన్ను
అన్నదమ్ములు సీతకై యడలి యేడ్చి
వారలంతట యసువులు వదలివేయు 323

కోతిబుద్ధులతోడ నే కూల్చిలంక
పరమపావని సీతను వహ్నికిడితి
వనచరుల్ సిగ్గుపడి తలవంచగాను
ఇంక వెళ్ళుట కిష్కింధ కేలనేను 324

అబ్ధి పడిపోయి వదలెద యసువులిపుడె
ఇంతకన్నను తెరువెద్ది యిపుడులేదు
కనులనీరెడి పనవితో కపివరుండు
తనువు వీడగనెంచగా తలచెనంత 325

ఈవిధంబుగ భావని యెంచి మదిలొ
తనువు బాయంగ సిద్ధమై తరువునుండ
శుభములిచ్చెడి శకునముల్ శోభతోచె
మిక్కుటంబైన హర్షాన మేనుపొంగె 326

ఎంతవెఱ్ఱిని యీరీతి చింతచేసి
అవనిజాత్మజ అసువులు అగ్నిలోన
అణగిపోయినట్లునే నలతబడితి
పావకుండామెనున్ గాల్చవశమె చూడ 327

భవ్యకులజుడు శ్రీరాము పట్టమహిషి
నిండుభక్తితో పతిగొల్చు నిర్మలాంగి
ధవుని యెడబాటు కోర్వక తపసునుండె
అట్టి యామెను తాకునే యనలుడసలు 328

కనుక నిప్పుడె జానకి గాంచబోదు
అంచు మారుతి క్షితిజంబునందు కెగసి
చేరెను అశోకవనమందు సీతదరికి
జనకపుత్రిక నటగాంచి సంతసించె 329

జనకపుత్రిక తానును సంతసించె
రక్షితంబుగ హనుమన్నరాగ జూచి
'అమ్మ కుశలమేనా' యంచు హనుమ మ్రొక్క
'హనుమ నీకును క్షేమమే' నడిగె నామె 330

తల్లిబిడ్డల రీతిగా యుల్లమలర
ఒకరి కుశలము వీక్షించి యొకరుమిగుల
ముదమునొందుచు హర్షాన ముచ్చటించి
కనుల నానందభాష్పాలు గార్చిరంత 331

అంత మారుతి కిష్కింధ కరుగదలచి
సెలవువేడుచు జానకి చెంతనిలువ
దైన్యమే రూపుదాల్చిన తెరువు నామె
పలికె దీనత సామీరి వంకజూచి 332

"తడవుచేయక వెళ్లినా ధవునిదరికి
రక్కసులుచేరి ననుబెట్టు యిక్కటులను
రామచంద్రుని మనసు కరంగురీతి
చెప్పి యిటకొచ్చురీతిగా చేయుమన్న" 333

"ఏల ఇంకను చింతింప ఇటుల తల్లి
వలదు నామాట నమ్ముము వార్ధిదాటి
పరుగుపరుగున వానర బలముతోడ
రామభూపాలు డెత్తును రమణినమ్ము 334

వీరశూరులు కీశులు వెంటనుండ
పద్మబాంధవు పట్టియు పక్కనుండ
చెంత సౌమిత్రి దర్శనచేయు రణము
సంధియంబేల రాముదే జయమునమ్ము 335

అబ్ధిదాటంగ వారికి యలవియేన
అంచు భయమందగా వద్దు అమ్మనీవు
నేను భుజమందు పదిలాన నిలిపికొంచు
ధరణిజామాత లక్ష్మణున్ త్వరగదెత్తు 336

చెట్లనవలీల లఘించు చెతురవరులు
బెదురులేనట్టి వానరుల్ భీమబలురు
చిన్న కాలువరీతిగా సింధువంత
ఒక్కగంతులో దుమికి యీ పక్కకొచ్చు 337

ఇంక రక్కసుల్ రణమున నిలువగలరె
రామసౌమిత్రి యస్త్రాల రావణుండు
అనిని గూలుటయును నిజమేను తల్లి
సుంత వోర్మితోనుండుమా సుదతినీవు" 338

ఎన్నొవిధముల నోదార్చి ఏగదలచి
చేతులంతట ముకుళించి సెలవుకోరి
వేగఎగసియు మింటికి విహగమట్లు
ఉదధిదాటంగ నుంకించి ఉరికి హనుమ
అచటగల యా అరిష్టాద్రియందు నిలచె 339

హనుమతాకిడి కోర్వకా యద్రి యదరి
వ్రక్కలయ్యెను ప్రళయము వచ్చినట్లు
వనచరంబులు భీతిల్లి పరుగులెత్తె
అందుగల యక్షకిన్నెరుల్ హడలియెగసె 340

ఫణులు పడగలు విప్పార్చి పొరజొచ్చె
ధ్రుమములన్నియు కూలెను తునకలగుచు
వింతవీక్షించ అమరులు అంతనిలిచె
హనుమ అచలమందు నిలువ నవసరమున 341

అబ్ధిదాటంగ కుప్పించి హనుమ ఎగసె
పిండిపిండిగ నయ్యెనా కొండయంత
వాలమల్లార్చి వేగాన వాయువట్లు
దూసుకొనిపోయె యంతట దోర్బలమున 342

వచ్చిచేరి మహేంద్రమున్ వాలి హనుమ
సింహనాదంబు హర్షాన చేసెనంత
అచటగల అంగదాదులు హనుమజూచి
సంతసంబున నార్చిరి స్వాగతముగ 343

హనుమ దుమికె మహేంద్రమునందునుండి
కీశులంతట గెంతుచు కిచకిచల్తొ
పట్టలేనట్టి యానందభరితులగుచు
కౌగలించిరి హనుమను గారవమున 344

ఇంక చెప్పుము రాముని యింతినెందు
గాంచివచ్చితివేఁయు ఘనముగాను
యంచు నడిగిరి వానరుల్ హనుమయంత
చెప్పదొడగె కీశులుచేరి వినగ 345

చూచివచ్చితి సీతను సొంపుగాను
ఉదధిలంఘించి యాలంక ఊరికేగి
లంఖిణినిగొట్టి నేనంత లంకజొచ్చి
అచట లంకేశు సౌధంబులన్ని యరయ
దనుజు సౌధాన లేదాయె తరుణి సీత 346

ఎందువెదకిన కనరాక యిందువదన
చింతతోడను నేనంత చెలియకొరకు
ఆ అశోక చెట్లవరుసలందు వెదకి
చిట్టచివరకు గాంచితి సీతనచట 347

ఏమిచెప్పుదు నటనున్న యింతిబాధ
మింటిమంటికి యేకమై కంటినీరు
కుమిలి ఘోరున విలపించి గుండెలవియ
మిగుల బాధతోనుండె నా మిథిలకన్య 348

ఆమెచుట్టును రక్కసి యాడవాండ్రు
చేరి బాధింప నేమియుచేయలేక
రామచంద్రుని చరణాల ప్రాణముంచి
తిండినిద్రయు లేకను దిగులునుండె 349

రక్కసుల రాజు క్రూరుండు రావణుండు
సీతదరికొచ్చి యేమేమొ చెప్పివేడి
ఆమె వినకున్న దుర్భాషలాడి యెంతొ
భీకరంబుగ నామెను బెదరగొట్టె 350

రావణేశుని మాటల రామపత్ని
కనులజారెడు కన్నీరు కాల్వలగుచు
ఏడ్వసాగెను చేసెడిదేమిలేక
సీత నటుజూడ నామది చింతనొందె 351

ఆవిధంబుగ రావణుండామె నెంతొ
కారుకూతలు తిట్టులు కూసివెడలె
చెట్టునుండియు దుమికితి చెంగుమనుచు
సీత ముంగిట నిలచినే చెంతచేరి 352

నన్ను రాక్షసమాయగా ~~దలచి~~ నమ్మకుండ
భయమునొందుచు బిట్టుగా పడతియేడ్చె
వానరుడనేను భయపడవలదు తల్లి
యంచు ననుగూర్చి చెప్పితి నామెకపుడు 353

వెలది యంతట శ్రీరాము విధముచెప్ప
మంచును యడుగగా నేను హర్షమంది
రామసౌమిత్రి గుణరూప రమ్యశోభ
చెలువుమీరగ జెప్పితి సీతకపుడు 354

రాముడంపగ వచ్చితి రామ యిటకు
దనుజు సౌధాలు ఛప్పరాల్ తరచిచూచి
ఎంచుగానక తుదకు నిన్నించు కంటి
నేనువచ్చిన పనియయ్యె నేడె నాకు 355

అమ్మ నామాట నిజమని నమ్ముతల్లి
యినకులేశుడు నీకెంతొ ఎలమిత్రోడ
అంగుళీయక మంపెను అవనికన్య
యనుచు అంగుళీయకము నేనామె కొసగ 356

హర్షపూరితనేత్రయై యామెయంత
ఉంగరమ్మని గొని ఎంతొ ఉల్లమలర
విభుని కన్నులగాంచిన విధముగానె
ముదము దుఃఖము యేకమై ముదిత మురిసె 357

రామలక్ష్మణ వీరులు లంకజొచ్చి
ఖండనమ్మన రావణున్ బట్టికూల్చి
నిన్ను గొనిబోవుటన్నది నిజముసుమ్ము
యింక దుఃఖమ్ము మరినీకు యేలనమ్మ 358

ఎంతొ నూరార్చి యామెకు యెన్నొచెప్పి
ఇంకబోయెద శలవిమ్ము యిపుడె నేను
అనుచు సీతను వీడ్కొని యచటినుండి
వెళ్ళి అందున్న వనమెల్ల విరిచినాను 359

కిసలయంచుల నొప్పారు కేళివనము
కూలదోయ రావణుడంత కుపితుడగుచు
పట్టి కోతినితెండని భటులబంప
అంతవచ్చిరి ననుబట్ట యసురులపుడు 360

రాక్షసాధము సేనతో రణముజేసి
వార్ని పడగొట్టి శమనుని వాటికంపి
సంతసంబున నుంటినే సంగరమున
యింక నాజికి వచ్చెను యింద్రజిత్తు 361

బ్రహ్మ అస్త్రంబు వేసినన్ బట్టియతడు
వెంటగొనిపోయె రావణు వీటికపుడు
అసురరాజంత ననుజూచి యాగ్రహించి
కోతి జంపెదనని ముందుకురికి వచ్చె 362

అచటికప్పుడు రావణ యనుజుడొచ్చి
వలదు కోతిని జంపుట వాసికాదు
వివిధరీతుల చెప్పుచు వేడుకొనగ
వాలమునుగాల్చి నను వారు వదలిరపుడు 363

అగ్నిరగిలెడి తోకతో యంతయెగసి
అచటనుండిన సౌధంబులన్ని యెక్కి
మంటలంటించ పూరంత మండిపోయి
బుగ్గికుప్పగ లంకంత అగ్గికలసె 364

అంత వాలమున్ ముంచినే అబ్ధిలోన
వనధి లఘించి పరుగుతో వచ్చినాను
యింక కార్యము మీయచే మేలియయిన
అనుచు పలుకగా వానరుల్ హర్షమందె 365

అంగదుడు జాంబవంతుడు యందరనిరి
శీఘ్రముగ రాముచెంతకు చేరవలెను
ఆలసించిన మనరాజు నాగ్రహించు
పరుగు పరుగున కదలుడీ ప్లవగులార 366

అంచు హెచ్చరికనుచేయ యౌనటంచు
ఛెంగు ఛెంగున కిష్కింధ చేరబోవ
దారిలోపల వానరుల్ దప్పిగొనుచు
మధువుత్రాగగ నేగిరి మధువనంబు 367

తోటకాపుండు దధిముఖున్ త్రోసితన్ని
మనసుతీరగ గ్రోలియు మధువునంత
చెట్లకొమ్మల విరిచియు చేసిరగడ
కూల్చివేసిరి వనమెల్ల కోతిమూక 368

వాలి అనుజుని కిష్టమౌ వనమునంత
కోతులందరుచేరి యారీతిచేయ
తత్తరంబున పరుగెత్తి దధిముఖుండు
వనచరులరాజు సుగ్రీవు వద్దకేగె 369

మోమువాడంగ వొడలంత ముడుచుకొనుచు
తడబడుచునంత సుగ్రీవు దరికిజేరి
చేతులెత్తి దధిముఖుండు చేసెవినతి
స్వామి సీతోట జొచ్చిరి ప్లవగులంత 370

మధువనంబులొ చెరియు మధువుత్రాగి
పూలపండ్లను తుంచియు పోగుపెట్టి
కొమ్మలన్నియు విరచిరి క్రోతిరేడ
అడ్డగించిన నసుబాది రందరపుడు
వారి పిలిపించి దండింపవలయు నీవు 371

సీతజాడకు వెళ్ళిన కోతులొచ్చి
మధువనంబున జేరియు మధువుత్రావి
రన్నమాటల సుగ్రీవు డాలకించి
హర్షముప్పొంగ రాముతో ననియెనిటుల 372

"స్వామి మన కార్యమెంతయో సఫలమయ్యె
దేవి జానకి నరయంగ తిరిగినట్టి
వానరులువచ్చి చేరెనా వనమునందు
ఇంక సందియంబువలదుయినకులేశ 373

పట్టి సాధించిరి జయము ప్లవగులంత
అటులకాకున్న వనమున కరుగబోరు"
అనుచు దధిముఖున్ గాంచియు యాజ్ఞచెసె
వనముకేగియు వారిని బంపుయిటకు 374

దధిముఖుండంత వనికేగి తడవులేక
వానరేంద్రుని మాటలు వానరులకు
చెప్పి వేవేగ సుగ్రీవు జేరుడిపుడె
యనగ కదలిరి వారంత హనుమతోడ 375

కేకలెట్టుచు కూయుచు గెంతులిడుచు
వచ్చిచేరిరి సుగ్రీవు భవనమునకు
మోములందున హర్షమ్ము ముసురుకొనిన
వారిగాంచుచు మెచ్చెను వానరేంద్రు 376

కీశులంతట సుగ్రీవు కెదుననిలచి
హస్తములుమోడ్చి తలవంచి అభివదించె
వానరులరాజు ముదముతో వారికనియె
యింక చెప్పుడీ మీవార్తలేమొ మాకు 377

హనుమజూపుచు వానరులనియె నపుడు
యితడె ఘనముగ సాధించె నింతపనిని
అనగ సుగ్రీవు డంతట హనుమపిలచి
వెళ్ళిచేసిన పనిచెప్పు వివరముగను 378

భక్తిమీరగ తలవంచి వాయుసుతుడు
మ్రొక్కి రామునిచరణాల మోకరిల్లి
చూచివచ్చితి సీతను శుభముగాను
అనుచు చెప్పియు మారుతి హర్షమలర
అబ్ధితరియించి నే లంకయందుజొచ్చి
దనుజుసౌధాల నరసితి తరుణికొరకు 379

తరుణి సీతమ్మ కనరాక దనుజువీట
చింతతోడను తిరిగితినే చివరికపుడు
రమ్యమయినట్టి సుందరా రామమందు
చెట్లనీడను యున్నట్టి సీతగంటి 330

హనుమ మాటలకెంతయో హర్షమంది
సీత దల్చుచు మరిమరి చింతతోడ
ఆమె వార్తను తెలియగా యవనివిభుడు
అంతులేనట్టి దుఃఖాన హనుమజూచి 381

లవణసంద్రము చుట్టిన లంకలోన
సీత ఏరీతినుండెనో చెప్పవయ్య
మమ్ము దలచుచునున్నదా మారుతాత్మ
దాపకుండగ తెల్పుమా తరుణిగూర్చి 382

ఏమిచెప్పుదు సీతమ్మ లేమగూర్చి
నిమిషమేమరకుండగా నిన్నుదలచు
రాముడేతెంచి దనుజుతో రణముజేసి
తననుచేకొను నాశతో తరుణియుండె 383

మాసిపోయెను వలువలు మనిషికూడ
వనితవేణియు చిక్కుతో బట్టెజడలు
కనుల నశ్రువుల్ ఆగక కారుచుండ
కఠిన నేలనుబడియుండె గాసిజెంది 384

సీతచుట్టును రక్కసుల్ చేరినిలచి
చెప్పలేనట్టి బాధలు చింతబెట్ట
వారి బారిని తప్పించువాడు లేక
దీనదశనుండె సీతమ్మ తెరువులేక 385

ధరణిజాత్మజ ననుజూచి దనుజుగానె
ఎంచిమితిలేని దుఃఖాన యెంతొ హొగిలి
రామ రఘురామ ననుగావ రమ్మటంచు
నిన్నుదలచుచు మూర్చిల్లె నెలతయపుడు 386

రామ శ్రీరామ రఘురామ రామయనుచు
నిన్ను పలుమారు తలువగా నేనుయంత
తరుణి తెలివొందె నేనామె దరికినేగి
భయములేదమ్మ అంచునే బలికితపుడు 387

నిన్నుగాంచగ వోయమ్మ నేనుయిటకు
రామదూతగ వచ్చితి రాముడంప
ఆనవాలుగ నీకంపె నమ్మయిదిగొ
అనుచు అంగుళీయకమివ్వ నామెకపుడు 388

ఉంగరమ్మునుగాంచి యుప్పొంగిపోయి
కనులజారెడు కన్నీరు కాల్వలవగ
అట్టె పలుమారు యెదలో హత్తుకొనుచు
నిన్ను గాంచినయట్లనే నెలతమురిసె 389

ఒదులుఅయ్యేను తనవ్రేలి కుంగరమ్ము
కంకణమ్ముగ తొడిగెను కరమునందు
కరమునందున ఒదులయ్యె కాంతకదియు
అప్పుడదితీసి నడుముకు యామెయుంచ
అంత నడుముకు యొడ్డాణ మనగనొప్పె 390

నీదు కుశలము నడిగెను నెమ్మిమీర
మరది సౌమిత్రి నడిగెను మరలమరల
భక్తితోమ్రొక్కి మ్రొక్కె నీ పదముకనియె
నిన్ను వేగమె రమ్మని నెలతవేడె 391

నెలలు రెండేను గడువుండె నెలతకింక
గడువుతీరిన యిక సీత కానరాదు
దనుజు డామెనుబట్టియు దునిమివేయు
చునుమకుండిన సీతయే తనువుపీడు 392

అమ్మ సీతమ్మ నామాట నమ్మవమ్మ
నిన్నుగాంచితి యికవేగ నేనుపోయి
నీవు యిందున్న వార్తను నిర్వచించి
రామచంద్రునితోడెత్తు రయమునిటకు 393

రామసౌమిత్రు లిర్వురు లంకజొచ్చి
రావణేంద్రుని బరిమార్చి రణమునందు
నిన్ను దోడ్కొనిపోవుట నిజముతల్లి
అంచు ఎంతయొ బ్రతిమాలి యంతనేను 394

యింకపోయెద శలవిమ్ము నేదిఅయిన
రామచంద్రుకు గుర్తుగా రమణియిమ్ము
యనగ ఎంతయొ ముదముతో యామెయపుడు
శిరసుదాల్చెడి రత్నంబు చేతనుంచె 395

ఆవిధంబుగ రాముతో హనుమచెప్పి
సీత యిచ్చిన రత్నంబు శీఘ్రమివగ
మారుతాత్మజు డిచ్చిన మణినిజూచి
యినకులేశుడు విలపించె నెంతగానొ 396

చూచినావయ్య లక్ష్మణా సుదతి మణిని
జనకుడిచ్చెను కళ్యాణ సమయమపుడు
సీత ధరియించె దీనిని శిరసునందు
మణినిదాల్చిన సీతయు మణిగనొప్పె 397

దేవి సీతకు నిష్టమౌ దివ్యమణిని
నాకు కానుకగబంపెను నయముగాను
సీత నిటగాంచినట్లయ్యె చెలువుమీర
యంచు తమకాన ఆమణిన్ అక్కుజేర్చె 398

రాముడారీతి నేడ్వగా రాముతమ్ము
డన్నదరికేగి ప్రేమతో ననియెనిట్లు
క్షేమముగనుండెనయ్య నీ చెలియ యచట
ఇంత దిగులొంద రఘురామ యేటికిపుడు 399

శూరవీరులు రఘువంశ సుతులుగారె
మనకు ఎదిరన్నవాడె ఈమహిని గలడె
దనుజు బడగొట్టి నాజిలో తక్షణమున
సీతగొనిరాగ లంకకు చేరవలెను 400

పౌరుషమ్మున సౌమిత్రి పలుకజూచి
భక్తికేల్మోడ్చి సుగ్రీవు పలికెనిటుల
"నీకు సాయమ్ము వానరుల్ నిందరుండె
రామ పోవుదమిప్పుడే రణముచేయ" 401

అంగదుడు జాంబవంతాదు లందరపుడు
రామభూపాలు పదముల ప్రణుతిచేసి
మేము నీ బంట్లమేనయ్య రాము నమ్ము
రణముచేయంగ పోదము రావణునతో 402

అగచరంబుల మాటల హర్షమంది
యింకపరీతి పోవుట లంకకనుచు
చింతచేసెడి శ్రీరాము చెంతచేరి
హనుమ వినయానమొక్కుచు ననియెనపుడు 403

స్వామి నీకు యోచన చెప్పువాడగాను
అయిన ఒకమాట జెప్పెద యవనినాధ
చెరలొ బాధలనుండెను సీతయచట
జాగుచేయక లంకకు జనగవలెను 404

ఎన్నొవిధముల నేడ్చియు నిన్నుదలచి
నెలతయున్నది శ్రీరామ నీవు వచ్చి
క్రూరరావణున్ సేనతో కూల్చివేసి
ముదముకూర్చును తనకంచు ముదితయుండె 405

ఇంక జాగేలనయ్యా యీ లంకకేగ
నేను బుజమున మిముదాల్చి నేగగలను
వానరుల్ యంత ఛెంగునన్ వార్ధిదాటు
ఇపుడె రావణున్ జంపగా ఏగనగును 406

లెండి లెండహో వానరుల్ లెండిలెండి
విహగమట్టుల వార్ధిని వేగదాటి
రావణునిబట్టి బలిమిని రద్దికీడ్చి
రామపత్నిని తేవలె రక్షితముగ
అట్టహాసాన పలికెడు హనుమజూచి 407

మోమునందున చిరునవ్వు మోసులెత్త
జానకినిగాంచు తరుణ మాసన్నమయ్యె
నంచు మదినెంచి హర్షాన అవనివిభుడు
తహతహల్ నిండి పులకించి తనువుపొంగ 408

ప్రేమమీరగ హనుమను పిల్చిదరికి
ఇంతకార్యము చేసితి వీవెకావె
అంచు రాముడు కరములనట్టె జూచి
కౌగలించెను హనుమను గాఢముగను 409

రాముకౌగిలి నొదిగిన రాముదూత
కనుల నానందభాష్పాలు గారిపోవ
ఇనకులేశుడు నాకిచ్చె యింతభాగ్య
మంచు మితిలేని సంతస మనుభవించె 410

మంగళంబిదె శ్రీరామ మహితమూర్తి
మంగళంబిదె జానకీమాత నీకు
మంగళంబిదె మాయన్న మారుతాత్మ
మంగళారతు లిత్తును మనసుదీర 411

మధురవరుల నానతిన్ మదినిదాల్చి
పిన్నపెద్దల కర్థమై ప్రీతిగలుగ
సులభశయిలిలో వ్రాసితి సుందరమును
తప్పులున్నను తలవంచి వొప్పుకొనెద 412

పిన్నలారింట పుట్టియు ప్రేమమీర
వీరభద్రనామాఖ్యుల వెలదినగుచు
వచ్చియుంటిని శ్రీగిరి వంశమునకు
సొగసుగూర్చితి సత్యప్రసూన యనగ 413

జానకీ రామచంద్రుల చరణములకు
వందనంబిడి వ్రాసిన సుందరమును
జన్మ సాఫల్యమగునట్లు సంతసమున
రామశరణున కిచ్చితి రమ్యముగను 414

జనకజాత్మజ రాముల సరసగాథ
హనుమ వ్రాయించె నాచేత హర్షమలర
భక్తిమీరగ చదివిన వారలకును
ఆయురారోగ్య సంపద లమరుగాక ! 415

సమాప్తము

## మంగళం శుభమంగళం

వందనం అభివందనం
శ్రీరామ శరణుకు అభివందనం
మంగళం శుభమంగళం
శ్రీరామ శరణుకు శుభమంగళం ॥
మా మనసులను రామమయముగ జేసిన
శ్రీరామ శరణుకు శుభమంగళం ॥
భక్తినెరుగని పామరులకు
భక్తిమార్గము చూపి మదిలో
రామనామామృతము నింపిన
శ్రీరామ శరణుకు మంగళం.
మనసులో నా మమత నెఱిగి
మధురమైన మంత్రమిచ్చిన
మద్గురువుగారికి మంగళం
వందనం అభివందనం
మంగళం శుభమంగళం
శ్రీరామ శరణుకు మంగళం